8

జులై 1978

# సృజన

నిర్వహణ
'సాహితీ మిత్రులు'

ఆధునిక సాహిత్య వేదిక
మాసపత్రిక

['కిస్సా కుర్సీకా' కేసులో బెయిలు రద్దుచేసి సంజయ్ గాంధీని జైలుకు పంపించగానే ఢిల్లీ తిహార్ జెయిల్లో పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ జెయిల్లో తన కొడుకు క్షేమం గురించి తనకు ఆందోళనగా వుందని చెప్పింది ఇందిరా గాంధీ. 'ఎమర్జెన్సీలో ఇం ఎక్కువగా అత్యాచారాలు చేసిన ఇంకొకవ్యక్తి లేడు' అని షా కమీషన్ తీర్పు చెప్పిన సంజయ్ గాంధీకి జెయిల్లో స్పెషల్‌క్లాసు యిచ్చారు. కుటుంబ సభ్యులకు ప్రతిరోజూ చూసే అనుమతి యిచ్చారు. ఎమర్జెన్సీలో లక్షలాది మందిని జెయిళ్ళలో పెట్టారు. చాల మంది తల్లులకు వాళ్ళ పిల్లలు ఏ జెయిల్లో వున్నారో కూడ తెలియదు. కొందరు తల్లులకు తమ పిల్లలు ఏమయ్యారో ఇప్పటికీ తెలియదు. ఆ తల్లులు కూడ ఎంత క్షోభపడిపోయారో క అటువంటి ఒక రాజకీయ ఖైదీ రాజన్. కేరళలో ఇంజనీరింగ్ కాలేజి విద్యార్థి. అ పోలీసు కస్టడీలోనే చంపేసారు. రాజన్ తండ్రి టి.యు. ఎచెరా వారియర్ మే 22వ తే ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లో ఒక లేఖ రాసాడు. ఎన్నో కన్న మమకారాల భావాల్ని ప్రతి బించే ఆ లేఖను ఇక్కడ ప్రచురిస్తున్నాం.]

# సంజయ్ తల్లికి రాజన్ తండ్రి లేఖ

❝ మే 10వ తేదీన ఒక పత్రికా విలేఖరుల గోష్ఠిలో మాట్లాడుతూ శ్రీమతి ఇందిరా గాంధీ జెయిల్లో తన కొడుకు క్షేమం గురించి ఆందోళన ప్రకటించింది. తన కొడుకును ఏ జెయిల్లో పెట్టారో కూడ తెలియదంది. ఆమె ఆందోళన నిజంగా సహజమైందే. కాని తనదాకా వచ్చినపుడు (గొడ్డలి తనమీద పడ్డప్పుడు) కానీ ఆమెకు మాతృక్షోభ అర్థం కాలేదు.

ఎమర్జెన్సీ కాలంలో నేనామెకు ఇలా రాసాను. "నీవు కూడ ఒక తల్లివి కాబట్టి రాజన్ తల్లి మానసిక వేదనను అర్థం చేసుకోగలవు. ఆమె రోగగ్రస్త. చట్టవ్యతిరేకమైన పోలీసు

— (వెనుక కవరులో)

ఈ సంచికలో....




SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'
Printed at Warangal Printing Press, J.P.N. Road, Warangal - 506 002
for Venkataramana Mudranalayam, Warangal
Working Editor: Varavararao

## రచనలకోసం విజ్ఞప్తి

ఆర్థిక ఇబ్బందులు, నిర్వహణా సమస్యలతోపాటు సృజన రచనల విషయంలో కూడ తీవ్రమైన కొరతను ఎదుర్కొంటున్నది. కళా విలువలులేని నినాదప్రాయమైన పాటలు, కవితలు, మూసలోపోసిన ఫార్ములా పద్ధతి కథలు, ఇతర భాషల్లోని మంచి రచనలకు (చెడ్డ) అనువాదాలు తప్ప మౌలికమైన ఉత్తేజ కరమయిన కనీసం తృప్తికరమైన రచనలు రావడంలేదు. ముఖ్యంగా సాహిత్య విమర్శ, సమీక్షలు, మౌలికమైన సృజనాత్మక రచనలు కరువయినాయి. ఉత్తమమైన రచనలు పంపించి ప్రజాసాహిత్య ప్రమాణాలు ఉన్నతంగా కాపాడడంలో సృజనకు ఇతోధికంగా సహకరించవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం.

— 'సాహితీ మిత్రులు'

---

# సృజన


ఆధునిక సాహిత్య వేదిక

మాస పత్రిక

81

జులై 1978

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా రు. 15

ఈ సంచిక రూ. 1-50

# ఎమర్జెన్సీ

ఎమర్జెన్సీ భయంకరమయిన చీకటి రోజులను ప్రజలు మరచిపోయారా? ప్రజలకు ఎమర్జెన్సీ బాధాకరంగా వుందా? ప్రజలకు ఎమర్జెన్సీ మాత్రమే బాధాకరంగా వుందా? ఎమర్జెన్సీకి ముందు నెహ్రూ ఇందిరా హయాంలో జనం అనుభవించిన సుఖాలను, తర్వాత ఈ 15 నెలల కాలంలోనే జనతా ప్రభుత్వ 'ప్రజాస్వామ్య పునరుద్ధరణ' లో జనం అనుభవిస్తున్న 'సుఖసంతోషాలు' ఎమర్జెన్సీ కాలంలో మాత్రమే లోపించినవా? ఎమర్జెన్సీ తర్వాత దేశంలో 'ప్రజల క్రమశిక్షణా రాహిత్యం' పెరిగి ప్రభుత్వ అసమర్థ పాలన రుజువయింది గనుక ఎమర్జెన్సీని సమర్థించవచ్చునా? మళ్ళీ ఎమర్జెన్సీ గురించో, మిలిటరీ పాలన గురించో తప్ప మన మింకే ప్రజాస్వామ్య జీవితం గురించి ఆలోచించలేమా?

ఈ అన్నింటికీ మన ప్రజలెవరు అన్న దాని మీద సమాధానం ఆధారపడి వుంటుంది. అల్లే ప్రభుత్వ స్వభావాన్ని అర్థం చేసుకోవడం మీద ఆధారపడి వుంటుంది. ముప్పయి సంవత్సరాలు ప్రజలమీద, ప్రజా పోరాటాలమీద నెహ్రూ ఇందిరా పాలన, ఆ కుటుంబాన్ని నిలిపిన దోపిడీవర్గం 'ప్రజాస్వామ్యం', 'సామ్యవాదం' పేర్లతో లాఠీలు, తూటాలు ప్రయోగిస్తూ వుంటే, ఆ మాటల్లో అర్థాలు వెతికే ప్రయత్నం చేసాం. 'అభ్యుదయాన్ని' చూసాం. తెలంగాణలో నాలుగువేల మంది రైతాంగ పోరాట యోధులను, అమాయక ప్రజలను నెహ్రూ-పటేల్ సైన్యాలు తూటాలకు గురిచేస్తే, కేరళలో కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని ఇందిరా నెహ్రూలు బజారునపడి దించేస్తే, నక్సల్బరీ, శ్రీకాకుళ రైతాంగ పోరాటాలను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రక్తపాతంలో ముంచేస్తే కమ్యూనిస్టులు కానివారంతా 'కమ్యూనిస్టు భూతం' తొలగిపోతుందని చంకలు గుద్దుకున్నారు. తనదాకా వస్తేకానీ తెలియదన్నట్లు ఎమర్జెన్సీ ప్రకటించి నక్సలైట్లు మొదలుకొని ఆర్ ఎస్ ఎస్ దాకా అందరినీ ఇందిరా గాంధీ జెయిళ్ళలో తోసి నోళ్ళు నొక్కినపుడు గానీ మనకు నోళ్ళు వున్నాయన్న విషయం మన సోయికి రాలేదు. ఏ నినాదాలూ ప్రజల నింకెంతో కాలం భ్రమల్లో కొనసాగించలేవనుకున్నప్పుడు ప్రజల ప్రాథమిక హక్కుల్ని హరించి ఇరవై సూత్రాలు వల్లించింది ఇందిరాగాంధీ.

ప్రజా పోరాటాలు శత్రువుల ఆయుధాల్నే కాదు శత్రువు నినాదాల్ని కూడ నిద్రపోనివ్వవు. అందుకే ఎమర్జెన్సీ, అందుకే ఇరవై సూత్రాలు. కాని ప్రజా శత్రువుల ఆయుధాలు ఎంత ఆధునికమైనవైనా, ఎంత ప్రమాదకరమైనవైనా అవి ఒంటరివి- వాళ్ళ నినాదాలు ఎన్ని రూపాలు మార్చుకొని వచ్చినా వాటి ప్రయోజ నాలు దోపిడీ వ్యవస్థను కాపాడడం. ఇక్కడ మనం అర్థం చేసుకోవలసిందల్లా ఆయా కాలాల్లో, దశల్లో దోపిడీవర్గ స్వభావం ఏయే రూపాల్లో వ్యక్తమవుతున్నదో మౌలికంగా పరిశీలించి విశ్లేషించడం. ఇందిరా గాంధీ మళ్ళీ అధికారంలోకి వచ్చి ఇందిరా నియంతృత్వం మళ్ళీ ఒకసారి ఈ దేశాన్ని కబళిస్తుందా అనే ఆలోచన, భయసందేహాలు అక్కడికే పరిమితమైతే అవి అమాయకమైనవీ, దూరదృష్టి లేనివీ. ఎమర్జెన్సీ నియంతృత్వ ధోరణులు జనతా ప్రభుత్వంలో కూడ కొనసాగుతున్నాయా లేదా అన్నది తీవ్రంగా ఆలోచంచవలసి వుంది. జనతా ప్రభుత్వంలో కూడ స్వభావ సిద్ధంగా ఆ ధోరణులు వుంటే తప్ప ఇందిరా గాంధీ పునరాగమనానికి అవ కాశం లేదు. ఆ ధోరణి అదే స్వభావం అంతకన్నా నగ్నంగా (నగ్నంగా ఎందువల్ల నంటే రాజకీయ అసమర్థతవల్ల) జనతా ప్రభుత్వాని కుందనడానికి దేశంలో నిత్యమూ రైతాంగము, కార్మికులు ఇతర పీడిత వర్గంపై జరుగుతున్న దమనకాండయే నిద ర్శనం. కార్మికుల హక్కుల కోసం ఇందిరా గాంధీతో పోరాడిన ఫెర్నాండెజ్ కార్మికవర్గం కడుపుమీద కొడుతున్న భూతలింగం కమిటీ సూచనలను బలపరుస్తున్నా డంటే, కార్మికులను తమ ఒకే ఒక్క ఆయుధమైన సమ్మెను ప్రయోగించ వద్దం టున్నాడంటే ఆయనకు ప్రజాస్వామ్యం పట్ల కార్మికవర్గం పట్ల వున్న పక్షపాతం ఎంత లోతయిందో అర్థమవుతూనే వున్నది. రాజకీయ ఖయిదీలను బేషరతుగా విడుదల చేస్తామన్న వాగ్దానంతో ఎన్నికలు గెలిచిన జనతా నాగా, మిజోలను, ఉత్తర ప్రదేశ్ పోలీసు పరిషత్ ఖయిదీలను రాజకీయ ఖయిదీలుగా గుర్తించడానికి కూడ నిరాకరిస్తున్నదంటే జనతా పార్టీ ప్రజాస్వామ్య స్వభావాన్ని సులభంగానే అర్థం చేసుకోవచ్చు. ఎమర్జెన్సీ ప్రమాదం మళ్ళా రావద్దు అంటే ఈనాడు గద్దెలెక్కిన ఇందిరా ప్రత్యర్థుల పదవులు పోగూడదనే అర్థంలోనే ప్రజాస్వామ్యం మీద ప్రేమ ప్రకటిస్తున్నారు ఉదార ప్రజాస్వామ్య వాదులంతా. ఎమర్జెన్సీలోనూ, అంతకన్నా ముందు దాదాపు ముప్పై సంవత్సరాలు ఏ వ్యవస్థను కాపాడడానికి ప్రభుత్వాలు కాలా

నుగుణ్యమైన నినాదాలు, ఆయుధాలు ఉపయోగించుకున్నాయో అదే పని ఈనాటి జనతా ప్రభుత్వం కూడ కొనసాగిస్తున్నది. అందుకే జనతా ప్రభుత్వం కార్మికులపై రోజూ తుపాకులు పేలుస్తూ, భూతలింగం కమిటీ సూచనలను బలపరుస్తూ, కార్మిక వర్గం హక్కుల్ని హరించ బూనుకున్నది. అందుకే అదే ప్రభుత్వం కనుసన్నలలో చెన్నారెడ్డి ప్రభుత్వం భార్గవ కమీషన్ పనిచేయకుండా కుట్ర పన్నడంలో సులభంగా సఫలీకృతమైంది. దోపిడీ వర్గాలకు నెహ్రూ ఇందిరలనే కాదు, మొరార్జీ చరణ్‌లనే కాదు, 'వామపక్ష పార్లమెంటరీ' ప్రభుత్వాలను కూడ ఎట్లా ఉపయోగించుకోవచ్చునో బాగా తెలుసు. ఆ అవకాశాన్ని దోపిడీవర్గానికి మనం యిచ్చినంత కాలం మన నెత్తిమీద ఎమర్జెన్సీ కత్తి వేళ్ళాడుతునే వుంటుంది. 75 జూన్ 26 కు 47 ఆగస్టు 15 లోనూ 50 జనవరి 26 లోనూ వేర్లు వున్నాయనే విషయం శాస్త్రీయంగా గ్రహించలేకపోతే 78 జూన్ 26 న 75 జూన్ 26 ను నెమరేసుకొని భయపడినా ప్రయోజనంలేదు.

26-6-78 — సంపాదకుడు

---

'ప్రజల మనిషి' నవలలో
'ప్రజా చైతన్యానికి భూమి సమస్య యిరుసులాంటిది'
వచ్చే సంచికలో
వరవరరావు.

---

జూన్ సంచికలో ప్రచురించిన సరోజ్‌దత్తా కవితలను
బెంగాలీ నుంచి అనువదించినవారు
అంజన్ ఘోష్ రతిబార్థలోమ్యూ.

---

వచ్చే సంచికలో సరోజ్‌దత్తా 'శకుంతల' కవితను బెంగాలీ నుంచి అనువాదం
సుమంతో బెనర్జీ

---

సవరణ: 33 వ పేజీలో బొల్లిముంత నాగేశ్వరరావు పాటకు శీర్షిక 'దొరకూలేడు!' అని చదువుకోవాలి. అందులోనే చివరి చరణంలో కూడ దొరకూలోడుకు బదులు దొరకూలేడు! అని చదువుకోవాలి.

---

# కవిత్వం గురించి చెన్ యీ కి మావో లేఖ

1965 లో చెన్ యీ (చైనా అగ్రనాయకులలో ఒకడు) తన గేయాలను సరిచేయమంటూ మావోకు పంపాడు. అవి చదివి ఆ గేయాలలో ఒకదానిని మాత్రం కొంత సరిచేసి పంపుతూ మావో చెన్ యీకి లేఖ రాశారు ఆ లేఖను ఇప్పుడు చైనాలో ప్రముఖంగా ప్రకటించారు. దానిపై చర్చలు నిర్వహించారు.

1977 డిసెంబర్‌లో పీకింగ్‌లో యీ లేఖ గురించి చర్చాగోష్ఠి జరిగింది. 10 మంది ప్రముఖ కవులు, విమర్శకులు చర్చలో పాల్గొన్నారు.

కవిత్వం గురించి ప్రగతి కాముకులలో, విప్లవాభిమానులలో సోషలిస్టు కమ్యూనిస్టు రచయితలలో ఎప్పుడూ చర్చలు జరుగుతూనే ఉంటాయి. మనదేశంలోనూ, మన తెలుగు సీమలోను కవిత్వం గురించి ఎన్నో ఆలోచనలు చర్చలు యిప్పుడూ జరుగుతూనే ఉన్నాయి. శిల్పం, రూపం, ఛందస్సు, అలంకారాలు, ప్రతీకలు, విషయం, సారం, వీటన్నిటికి ఎంతెంత పాత్ర ఎలాఉండాలి అనేవి కవులకు కవిత్వాభిమానులకు ముఖ్యమైన విషయాలే. ఈ విషయాలపై మావో సెటుంగ్ ఎలా ఆలోచించాడు? ఏమి చెప్పాడు? మావో రాసిన యీ ఉత్తరమూ, చైనాలోని చర్చ కొంత ఉపయోగకరమేనని, చైనీస్ లిటరేచర్ 4, 1978లో వచ్చిన వాటిని అనువదించి ఇస్తున్నాం.

— 'సాహితీ మిత్రులు'

**మావో లేఖ:**

కామ్రేడ్ చెన్ యీ

మీరు మీ కవితలకు మెరుగులు దిద్దమని నన్నడిగారు. మీరు రాసిన ఐదుపదాల లు-షి పద్యాల రచన నాకురాదు. ఆ ఛందస్సు కవితలు నేనెప్పుడూ రాయలేదు. కాబట్టి మీరడిగిన పని నాకు చేయరాదు. మీకవితల్లో శక్తి, విస్తృతి ఉంది. రూపంలో ఛందస్సులో మాత్రం అవి సరైన లు-షి ఛందస్సుగా లేవు. లు-షి ఛందస్సులో ఖచ్చితమైన స్వరనియమం ఉంటుంది. ఈ విషయంలో మనమిద్దరమూ కొత్తగా నేర్చుకుంటున్న వాళ్ళమే. 7 పదాల లు షి పద్యాలు అప్పుడప్పుడు కొన్ని రాశాను. వాటిలో ఏదీనాకు తృప్తి అనిపించలేదు. ఛందోరహిత కవితలు రాయటంలో మీరు కొంత పర్వాలేదు. అలాగే అసమ పాదాలతో 'ట్సు' (tzu) ఛందస్సు గేయాలు రాయటం నాకు కొంతవచ్చు. యే చీన్ ఇంగ్ (ఇప్పటి చైనా అగ్రనాయకులు ముగ్గురిలో ఒకరు-సం॥) 7 పదాల లు-షి పద్యాల రచన బాగానే చేయగలడు. కామ్రేడ్ టుంగ్‌కు (టుంగ్-పి-వు

93 ఏళ్ళ వయస్సులో 1976 లో చనిపోయిన ముఖ్య నాయకుడు-సం॥) 5 పదాల లు-షి పద్యాల రచన వచ్చు. ఈ రూపాల్లో మీరు కవితలు రాయదలుచుకొంటే వారి సలహా పొందటం మంచిది.

['పశ్చిమాభిముఖంగా ప్రయాణం' అనే మకుటంతో చెన్‌యీ రాశిన గేయాన్ని కొంత సవరించి పంపుతూ మావో యింకా యిలా రాశాడు. ఆ గేయ అనువాదాన్ని ఇక్కడ ఇస్తులేము- సం॥]

ఈ గేయంలో కొన్ని మార్పులు చేశాను- అయినా నాకు తృప్తికరంగా లేదు- మిగతాది చేయలేననుకుంటున్నాను.

మరో విషయం- భావాలను వెలిబుచ్చే కోసం కవిత్వం ప్రతీకలను, ప్రతిచిత్రాలను (images) ఉపయోగిస్తుంది. వచనంలో వలె సాదాగా చెప్పకూడదు. ఉపమానాలు, అలంకారాలు, ప్రతీకలు తప్పనిసరి. టు-ఫు రచించిన నార్తర్న్ జర్నీలోవలె ప్రత్యక్ష కథన పద్ధతి కూడా ఉపయోగించవచ్చు కాని అందులో కూడా ఉపమానాలు (ఒకదాన్ని మరోదానితో పోల్చి చెప్పటం) ప్రతీకలు, ప్రతిచిత్రాలు (ముఖ్య విషయానికి నడుపుకు వెళ్ళేకోసం మరోదాన్ని ఎత్తుకు చెప్పటం) అవసరం అవుతాయి. హాన్-యు కవిత్వంలో వచన శైలిని వాడాడు. అతనికి కవిత్వం గురించి ఏమీ తెలీదని కొందరన్నారు. కాని మరీ అలా అనటం అన్యాయం. అతని కవితలు కొన్ని చెప్పుకో తగినవి. మొత్తము మీద- కవిత్వం రాయటం తేలిక కాదు.

సుంగ్ వంశం రాజుల కాలపు చాల మంది కవిత్వం భావాలను ప్రతీకల ద్వారా పోలికల తోటి వెలిబుచ్చ వలసివుంటుందని అర్థం చేసుకోలేదు- కాబట్టే వారు టాంగ్ కాలపు కవిత్వ సాంప్రదాయాన్ని స్వీకరించలేదు. ఫలితంగా వారి రచనలు సాదాగా నిస్తేజంగా ఉన్నాయి.

ఇదంతా పురాతన కవిత్వాన్ని గురించి ఆధునిక కవిత్వంలో వర్గపోరాటాన్ని, ఉత్పత్తి కృషిని ప్రతిబింబించే కోసం ప్రతీకలు ఉపమానాలద్వారా భావాలను వెలిబుచ్చే పద్ధతిని మనం ఉపయోగించుకోవాలి. అట్లని పురాతన ఛందస్సులకు ప్రయోగాలకు పోవాలని కాదు. వ్యవహారిక దేశీ భాషా కవిత్వం గత కొద్ది దశాబ్దాలలో తప్ప అంతగా జయప్రదం కాలేదు. కొన్ని మంచి జానపద గేయాలు మాత్రం వచ్చాయి. బహుశా ఇక ముందు ముందు జానపద గేయాల నుంచి పరిపుష్టిని పొందుతూ వాటినుంచి మంచి రూపాలను శైలిని తీసుకొంటూ సామాన్య పాఠకులందరకూ నచ్చే కొత్త కవిత్వం రావచ్చు.

లి-పౌ కొన్ని మాత్రమే లు-షి ఛందస్సులో రాశాడు. 5 పదాలవి కొన్ని తప్ప 7 పదాల లు-షి ఛందస్సులో అసలు రాయనేలేదు. లి-హోవి చదవవలసినవి. మీకు ఇదంతా ఇష్టమో కాదో మరి.

అభినందనలతో
మావో-సె-టుంగ్

1. లు-షి పురాతన చైనా సాంప్రదాయక కవితా రూపం ఖచ్చితమైన లయబద్ధత, స్వరనియమం కల 8పాదాలుంటాయి ఒకో పాదంలో 5గాని 7గాని (ఒకేనియమం) పదాలుంటాయి. ఈరచనలు టాంగ్‌వంశం (618-907) కాలంలో బహుళ ప్రచారంలో ఉన్నాయి.
2. ట్సు (tzu) గేయ రూపం టాంగ్‌వంశం కాలంలోవచ్చింది. మావోవి ప్రకటించిన 39 గేయాలలో 25 ట్సు ఛందస్సువి.
3. టు-పు (712-770) పురాతన చైనా మహాకవి. అతని కవితలలో వాస్తవికత ఉండి, తన కాలపు పరిస్థితులను ప్రతిబింబిస్తాయి.
4. హన్-లు (768-824) టాంగ్ వంశ కాలపు కవి. పేరందని వచన రచయిత.
5. లి-పౌ (701-762) పురాతన చైనా మహాకవి. అతని కవితలు విమర్శనాత్మకంగా భావుకత కలిగి దేశభక్తి పూరితంగా ఉండేవి.
6. లి-హో (790-816) టాంగ్ వంశం మధ్యకాలంలో జీవించిన కవి.

[1977 డిశెంబర్ 14న పెకింగ్‌లో జరిగిన చర్చా గోష్టిలో 60 మందికి పైగా కవులు విమర్శకులు, కవిత్వం గురించి చెన్‌యీకి మావో రాసిన లేఖను అధ్యయనం చేసి చర్చించారు. ఈ లేఖలో మావో గతకాలపు చైనాకవుల అనుభవాన్ని క్రోడీకరించి చైనా కవితారచనకు మార్గదర్శక కళాసూత్రాలను స్పష్టంచేసి చైనా భవిష్యత్ కవితకు ఉన్న మార్గాన్ని చూపాడని వక్తలందరూ భావించారు. ఆ రకంగా చైనా సోషలిస్టు సాహిత్యము కళల అభివృద్ధిలో యీ లేఖా ప్రచురణకు చాలా ప్రాముఖ్యంఉంది. ఇక్కడ ఆ వక్తలలో ఒకరి అభిప్రాయ భాగాలను ప్రచురిస్తున్నాం.- చైనీస్ లిటరేచర్ సంపాదకులు]

కామ్రేడ్ చెన్-యీకి చైర్మన్ మావో రాసిన యీ లేఖ చైనీ కవిత్వం ఎడల మావో దృష్టిని తెలియబర్చుతూ భవిష్యత్ కవితారచనకు సంబంధించిన ముఖ్య సమస్యలను పరిష్కరించింది.

చైర్మన్ మావో సాహితీ కళారూపాల యెడల చాలా శ్రద్ధచూపారు. కళాకారుడు శైలిలో రూపంలో పరిపూర్ణతను సాధించ కృషి చేయకపోతే అతని కృషి ప్రజలను కదల్చలేదు. దానికి ప్రభావం ఉండదు. కవిత్వంలో రూపంకు ప్రత్యేక ప్రాముఖ్యత ఉంది. పురాతన ఛందస్సులనుండి నేటిదేశీ కవితల వరకూ కవితా రూపాలెలా మార్పులొందినా ప్రతి కవిత్వానికి ఒక కవితారూపం ఉండక తప్పదు. ఆ భాష యొక్క ప్రత్యేక గుణాలనుబట్టి, సామాజిక మార్పులబట్టి, కవితా సంవిధానంలోని పరిణామాలబట్టి కవితారూపాలు వస్తూ మార్పుచేర్పులు పొందుతూ ఉంటాయి. అయినా వాటి పోకడలో చూడదగినంత స్థిరత్వం ఉంటుంది. కవితారూపాలు లేనిది కవిత్వంకాదు. అది మరోరకపు కళ అవుతుంది. అంటే దీనర్థం రూపమే సారాన్ని నిర్ణయిస్తుందని కాదు కాని, సారానికి అదుపులు పెడుతూ తద్వారా భావ వ్యక్తీకరణలో పరిపూర్ణతా సిద్ధికి తోడ్పడుతుంది. లేక తద్విరుద్ధంగా భావ వ్యక్తీకరణకు సంకెలగానయిన కావచ్చు.

నిజజీవితాన్ని ప్రతిబింబించేందుకు సాహిత్యం కళలు ప్రతీకలనుపయోగించుతాయి. కవిత్వమూ యిందుకు మినహాయింపు కాదు. కథన కవితలు ప్రజల, దృగ్విషయాల స్పష్టమైన ప్రతీకలను ప్రతిబింబాలను ఏర్పరచు కోవాల్సొస్తుంది. గేయ కవితలు కూడా వాస్తవ ప్రజల మనోభావాలను వ్యక్తీకరించుతాయి. (ఉపమానాలు అలంకారాలు, ప్రతీకల ద్వారా చెప్పటం యివన్నీ కూడా వస్తుగత ప్రతి చిత్రాలను (objective-images) ఉపయోగిస్తాయి. కనుక కవి తనభావాలను వెల్లడించటానికి తన రచనలో ప్రతీకలను ప్రతి చిత్రాలను ఉపయోగించుకోవాలి. ప్రతీకల ద్వారాను చిత్రణలతోటి ఆలోచించటమూ తర్కబద్ధంగా ఆలోచించటమూ పొసగనివికావు. తర్కబద్ధ నిర్ణయాల కొచ్చేకోసం సాహిత్యము కళలూ ప్రతీకలను ఉపమానాలంకారాలను ఉపయోగిస్తాయి; భౌతిక దృగ్విషయాల సంక్లిష్టతను ప్రజలచే గుర్తింప చేయటానికి సాంఘిక శాస్త్రాలు తార్కిక విశ్లేషణనుపయోగిస్తాయి. సాహిత్యానికి విజ్ఞానశాస్త్రానికి ఉన్న భేదాన్ని ప్రజల మనసులపై అవి కలిగించే ప్రభావాలను మనం గణనలోకి తీసుకుంటే కవుల కళాకారుల సృజనశీల ఆలోచనకు శాస్త్రవేత్తల పరిశోధనా కృషికీవున్న తేడాను కాదనలేము. చైర్మన్ మావోకు పురాతన చైనా కవులలో టాంగ్ వంశం కాలపు (619-907) లి-పొ లి-హోలంటె ఎక్కువ గౌరవం. వీరిద్దరిదీ స్వతంత్రమైన భావుకతా ధోరణి. వారి భావాలకు ఊహలకు నియమబద్ధ ఛందస్సు సంకెళ్ళు కాబట్టి వీరుకఠిన నియమాల ఛందస్సు రచనలు చేయలేదు.

కాని మావో మాత్రం నియమబద్ధ పాట ఛందస్సులోనే రాశారు- అయినా ఆ నియమాలు ఆయనకున్నా మహా విప్లవాత్మక అవరోధాలు కాలేకపోయినవి. హాన్-యు

కవిత్వంలో వచన శైలి వాడినాడని అయినా వాటిలో కొన్ని మంచివే ఉన్నాయి కాబట్టి ఆయన కవిత్వాన్ని కొట్టిపారేయ వీల్లేదని చైర్మన్ మావో యీ లేఖలో అన్నారు. అంటే వివిధ శైలులను రూపాలను వినియోగించిన అన్ని రకాల కవుల నుండీ నేర్చుకోవాలని, వారి వారి మంచిని తీసుకొని పనికి రాని దాన్ని విసర్జించాలని మావో బోధించాడు.

నలుగురి ముఠా భావవాద అధిభౌతికవాద (metaphysical) భావాలను ప్రసారం చేసి సారస్వత కళారంగాలలో పెద్ద గందరగోళం సృష్టించారు. రూపం విషయంలో శ్రద్ధ వహించటాన్ని వ్యతిరేకించి అలాచేసిన కవులను 'రూపవాదుల'నీ (formalists) వారు సిద్ధాంత విషయాలను విస్మరిస్తున్నారని నిందలు వేశారు. ప్రతీకలు ఉపమానాల ద్వారా భావాలను వ్యక్తీకరించే కృషిచేసిన వారిని కూడా నలుగురి ముఠా వ్యతిరేకించే వారిని మార్క్సిస్టు మార్గదర్శక సూత్రాలను ప్రతికూలిస్తున్న వారుగా నిందించారు.

సాహిత్య కళాసృష్టికి సంబంధించిన మూలసూత్రాలను యీ ముఠా ఎదుర్కొనటం వల్లనే సాహిత్యంలో కళలలో చప్పదనం వచ్చి నిస్సారం అయినవి. నిర్ణీత సాధారణ అభిప్రాయాల కనుగుణంగా పాత్రల చిత్రణ జరిగి విసుగుగా జీవరహితంగా తయారైనాయి. ప్రతీకలతోటి, అలంకారాలతోటి ఆలోచించటాన్ని వ్యతిరేకించటమంటే రచయితలు ప్రజలలోకి చొచ్చుకుపోవటాన్ని తిరస్కరించటమే అవుతుంది. ఎందుకంటే వివిధ రకాల ప్రజలలో మెలుగుతూ వారిని పరిశీలించి అధ్యయనంచేసి బాగా ఎరుకపరచుకొంటేనే వివిధమైన పాత్రలకు స్పష్టమైన మనోచిత్రణలను రచయితలు ఏర్పరచుకోగల్గుతారు. జీవన వృక్షం ఎప్పుడూ పచ్చగనే ఉంటుంది. వాస్తవ జీవితాన్నించి బయలుదేరని సాహిత్యం కళలు మృతప్రాయాలే. చైర్మన్ మావో రాసిన యీ లేఖ నలుగురి ముఠా ప్రతిపక్షభావాలను పడగొట్టేందుకు పనికొచ్చే పదునైన ఆయుధం.

లిన్-మొ-హాన్
సాహిత్య విమర్శకుడు

---

# పాలస్తీనా విమోచనోద్యమం -



పాలస్తీనా
ప్రజాకవి
ఘసన్ కన్ఫానీ

నీవు విసరిన గ్రెనేడ్
జియోనిస్టుల గుండెలలో ప్రేలుతున్నది
నీవు ప్రేల్చిన రాకెట్
నియోజారుల మతులు పోగొడుతున్నది
గురితప్పని నీతుపాకీ
డాలర్ పాలకులకు సింహస్వప్నం
నీవెగరేసిన స్వేచ్ఛాపతాక
అరబ్ పాలక వర్గాలకు కంటకప్రాయం

తిరుగుబాటు నీ ఊపిరి
విముక్తి నీ గమ్యం
పోరాటమె నీ మార్గం
అంతర్జాతీయత నీ సిద్ధాంతం
అరబ్ పీడితప్రజల ఆశాజ్యోతివి
నీపేరే కమెందో !
పాలస్తీనా కమెందో !!
అందుకో మా రెడ్ శాల్యూట్ !!!

[పాలస్తీనా విమోచనోద్యమ సాహితీ, సాంస్కృతిక రంగనాయకుడు, ప్రముఖ విప్లవ రచయిత ఘసన్ కన్ఫానీ 1972 జులై 8వ తేదీన శత్రువులచే హత్య చేయబడ్డాడు. ఆయన ఆరవ వర్ధంతి సందర్భంగా ఆయన స్మృతికి చిహ్నంగా ఆయన సాహిత్య జీవితంతోపాటు, ఆ సాహిత్య జీవితాన్ని మలచిన పాలస్తీనా విమోచనోద్యమ సంక్షిప్త రాజకీయ చరిత్రను కూడ ప్రచురిస్తున్నాము.]

వర్తమాన అంతర్జాతీయ రంగంలో అత్యంత కీలక పాత్ర వహిస్తున్న సమస్య పాలస్తీనా సమస్య. 1917 కి పూర్వపు ప్రపంచ పటాలలో పాలస్తీనాగా చూపబడ్డ ప్రాంతం నేటి ప్రపంచ పటాలలో ఇజ్రాయిల్‌గా చూపబడుతోంది. అందుకే నిన్నటి

పాలస్తీనా నేటి ఆక్రమిత పాలస్తీనా. అంతర్జాతీయ సామ్రాజ్యవాదం బడుగు దేశాల ప్రజానీకాన్ని దోపిడిచేసేందుకై ఎంచుకున్న కొన్ని ప్రధాన Trubls Spots లో పాలస్తీనా ఒకటి. ఆసియా, ఐరోపా, ఆఫ్రికా దేశాల మధ్య సూయజ్ కాలువ సమీపంలో అత్యంత కీలకస్థానంలో వున్న పాలస్తీనా సామ్రాజ్యవాదులను ఆకర్షించ టంలో ఆశ్చర్యంలేదు. 1917 లో అప్పటి బ్రిటిషు ప్రధానమంత్రి బాల్ఫర్ చేసిన ప్రకటనతో పాలస్తీనా గడ్డపై ఇజ్రాయేల్ సృష్టికి అంకురార్పణ జరిగి 1948 మే నెల 15 వ తేదీ ఇజ్రాయేల్ దేశము ఏర్పడినట్లుగా అధికార ప్రకటన వెలువడటంతో ఆ ప్రహసనం ముగిసింది. 1917-1948 మధ్య కాలములో యూదు టెర్రరిస్టుల భయాన కమైన క్రూర అకృత్యాలకు తట్టుకో లేక లక్షలాది పాలస్తీనా ప్రజానీకం తమ మాతృ భూమిని స్థిర చరాస్తులను వదలి కట్టుబట్టలతో కాందిశీకులుగా యిరుగున వున్న లెబనాన్, సిరియా, జోర్డాన్ వంటి దేశాలలో శరణార్థి శిబిరాలలో దుర్భర జీవితం గడుపుతున్నారు.

1918 లో అంటే బాల్ఫరు ప్రకటన వెలువడిన సంవత్సర కాలానికి పాలస్తీనా బ్రిటిషు పాలకుల ధర్మకర్తృత్వ దేశం (Mandetary Territory) గా రూపొంది 1948 మే 15 వరకు అలాగే కొనసాగింది. బ్రిటిష్ సామ్రాజ్యవాదుల, ప్రత్యక్ష పరోక్ష మద్దతుతో 1918 నుండి తమదేశములోనికి ప్రవేశిస్తున్న యూదులను పాలస్తీనా దేశ భక్తియుత ప్రజానీకము వీరోచితంగా ప్రతిఘటించారు. 1948 లో ఇజ్రాయేల్ 'వికృతసృష్టి' అనంతరం వారి ప్రతిఘటన మరింత సుసంఘటితము, తీవ్రతరమై గెరిల్లా యుద్ధంగా మార్పు చెందింది. తమ మాతృదేశం విముక్తికోసం పోరాడుతున్న అనేక దేశభక్తియుత గెరిల్లా సంస్థలు జెరూసలెంలో సమావేశమై 1964, మే నెల 28వ తేదీ పాలస్తీనా విమోచన సంస్థ(పి.యల్.ఓ) గా రూపొందాయి. "సాయుధపోరాటం ఒక్కటే పాలస్తీనా విముక్తికి మార్గం. అదృష్టావ్య అది వ్యూహం-ఎత్తుగడకాదు" అని పి.యల్.ఒ. ముసాయిదా స్పష్టం చేసింది.

విస్తరణ కాంక్షగల జియోనిస్టు ఇజ్రేలీ పాలకవర్గాలు అమెరికన్ సామ్రాజ్య వాదుల పూర్తి మద్దతుతో యిరుగుపొరుగు అరబ్ దేశాలపై నాలుగు దురాక్రమణ యుద్ధాలు చేశాయి. దళారి బూర్జువా వర్గాలు అధికారంలో వున్న అరబ్ రియాక్షనరీ పాలకవర్గాలు తమ మనుగడకొరకై ఏదోఒక అగ్రరాజ్యంపై ఆధారపడటం మూలంగాను, పాలస్తీనా సమస్యపై వారిలో వారికి తీవ్రభేదాభిప్రాయాలు వుండటం మూలంగాను, అంత ర్గత వైరుధ్యాల మూలంగాను, ఇజ్రేలీ దురాక్రమణను అడ్డుకొనటంలో ఘోరంగా విఫలం చెందటమేకాక పైపెచ్చు తమ భూభాగాలను ఇజ్రాయేల్ పరంచేశారు. కాలం

గడచినకొద్దీ పాలస్తీనా విమోచనోద్యమము మరింత బలీయమై ఒక బ్రహ్మాండమైన శక్తిగా అభివృద్ధి చెందటంతో బెంబేలెత్తిన అరబ్ రియాక్షనరి పాలకవర్గాలు రెండు అగ్రరాజ్యాల వత్తిడులకు లొంగి విమోచనోద్యమాన్ని రూపుమాపి, ఇజ్రాయెల్‌తో 'రాజీ' పడాలని ప్రయత్నిస్తున్నాయి. మొదట్లో క్రూర దమనకాండను ప్రయోగించడం ద్వారా విమోచనోద్యమాన్ని రూపుమాపవచ్చునని అందరు ఆశించారు. 1970_72 మధ్య కాలంలో జోర్డాన్‌లో హుస్సేన్ సైన్యాలకు పాలస్తీనా కమాండోలకు మధ్య జరిగిన తీవ్రస్థాయి సంఘర్షణలు, 1975_77 మధ్య లెబనాన్‌లో "అంతర్యుద్ధం" తెరచాటున గెరిల్లా స్థావరాలపై లెబనాన్ మితవాద వర్గాలు, సిరియా సైన్యాలు జరిపిన దాడులు యిందుకు నిదర్శనాలు. ఈ సంఘటనల మూలంగా విమోచనోద్యమం దెబ్బతిన్న మాట వాస్తవమే అయినా మొత్తంమీద దాని ప్రభావం పెరగటంతో సైనికచర్యలద్వారా విమోచనోద్యమాన్ని 'రూపు మాపాలని' ప్రయత్నించటం అరచేతిని అడ్డుపెట్టి సూర్య కాంతిని ఆపటమేనని గ్రహించేందుకు అరబ్ పాలకవర్గాలకు ఎంతోకాలం పట్టలేదు.

ఇన్ని నిర్బంధాలకు సహితం తట్టుకొని పాలస్తీనా విమోచనోద్యమం అప్రతిహతంగా పురోగమించడంతో పశ్చిమాసియా సంక్షోభంలో "పెద్దన్నయ్య" ల పాత్ర వహిస్తున్న అమెరికన్_రష్యన్ సామ్రాజ్యవాదులు మరీ అయోమయంలో పడిపోయారు. 'ఆక్రమిత' అరబ్ ప్రాంతాలలో [యిక్కడ 'ఆక్రమిత' అంటే అర్థం ఇజ్రాయెల్ ఏర్పడిన తర్వాత అరబ్ దేశాలనుండి ఆక్రమించుకున్న ప్రాంతాలు] ఒక పాలస్తీనా రాజ్యాన్ని ఏర్పాటుచేసి ఆ రకంగా సమస్యకో ముగింపు కల్పించాలని రెండు అగ్రరాజ్యాలు తాపత్రయ పడుతున్నాయి. ఒకానొక దశలో పి. యల్. ఓ అధినేత అరాఫత్ ఈ సూచనపట్ల ఆమోదం తెలిపినా తన అనుయాయులనుండే ప్రతిఘటన ఎదురు కావడంతో వెనుకడుగు వేశాడు. పైపెచ్చు అలాయేర్పడే పాలస్తీనా దేశపు స్వరూప స్వభావాలను గురించి అరబ్ దేశాలమధ్య తీవ్ర విభేదాలు తలెత్తాయి. వామపక్ష భావాలుకలిగే పాలస్తీనా ప్రభావ ప్రభంజనము కాలక్రమేనా తమ మనుగడకే ప్రమాదంగా తయారవుతుందేమోనన్న భయం అటు ఇజ్రేలి పాలకులకు, ఇటు అరబ్ రియాక్షనరీ పాలకవర్గాలకు పట్టి పీడిస్తున్నది. దీనితో అటు అరబ్ పాలక వర్గాలమధ్య, ఇజ్రాయేల్ అమెరికాల మధ్య, అమెరికా_రష్యాల మధ్య వైరుధ్యాలు మరింత తీవ్రమై దిక్కుతోచని అయోమయ స్థితిలో పడిపోయారు. యిది నేటిపరిస్థితి.

### విమోచనోద్యమ స్వరూపం _ స్వభావం:

ప్రపంచ రాజకీయరంగాన్నే కుదిపివేస్తున్న పాలస్తీనా విమోచనోద్యమ స్వరూప స్వభావాలేమిటి? ఈ విషయమై విభిన్న గెరిల్లా సంస్థల మధ్య స్థూలంగా ఏకాభిప్రాయ

మున్నా ఎత్తుగడలకు సంబంధించి మౌలికమైన విభేదాలే వున్నాయి. అవకాశవాదంతో కూడిన మితవాద పంథాలో పయనిస్తున్న అల్-ఫతా (Al-Fath) ఒక మార్గాన్ని చేపటితే మార్క్సిజమ్-లెనినిజమ్-మావో ఆలోచనా విధానాల వెలుగులో పయనిస్తున్న పాపులర్ ఫ్రింటుఫర్ ది లిబరేషన్ ఆఫ్ పాలస్తీనా (పి. యఫ్.యల్.పి), పాపులర్ డెమొక్రాటిక్ ఫ్రింటుఫర్ ది లిబరేషన్ ఆఫ్ పాలస్తీనా (పి. డి. యఫ్. యల్. పి) సంక్షిప్తంగా డెమో క్రాటిక్ ఫ్రింట్ వంటి వామపక్ష క్రియాశీల సంస్థలు మరో మార్గాన్ని చేపట్టాయి.

'దేశ బహిష్కృతులు కాబడ్డ'పాలస్తీనా వారిలో వర్గాలు లేవని, వారందరిలో ఒకే విధమైన విప్లవదీక్ష (Revolutionary Spirit) ఉంటుందని అరాఫత్ నాయక త్వాన గల అల్-ఫతా భావిస్తున్నది. అరబ్‌దేశాల మధ్య అనైక్యతకు భేదాభిప్రాయాలకు ఇజ్రాయేల్ వునికే ప్రధానకారణం కాబట్టి పాలస్తీనా విముక్తి విషయంలో అవన్ని సంఘటి తంగా వ్యవహరిస్తాయని, అందుకుగాను అరబ్‌దేశాల పాలకుల వర్గ స్వభావాలను గురించి ఆలోచించక వారితో శాంతియుత సహజీవనం గడపాలని, ఆయాదేశాల 'అంతరంగిక' వ్యవహారాలలో జోక్యం కలిగించుకోరాదని అల్-ఫతా భావిస్తున్నది. "విప్లవం సిద్ధాంతాన్ని నిర్ణయిస్తుందే కాని సిద్ధాంతం విప్లవాన్ని నడిపింపదు" అనే సిద్ధాంతాన్ని నమ్మిన అల్-ఫతా సైద్ధాంతిక తగవులకు అతీతమైన విప్లవోద్యమానికి ప్రాతినిధ్యం వహిస్తున్నట్లుగా భావిస్తున్నది. అంతేగాక పాలస్తీనా విమోచనోద్యమానికి ఒక సైద్ధాంతిక మూలం వుండటం అనవసరమని, అది అనర్థాలకు దారితీస్తుందని అల్ ఫతా భావిస్తున్నది "....గతం నేర్పిన సామాజిక సత్యాలపై విభేదాలు వున్నంతకాలము, ప్రతి సామాజిక సత్యము కాలంతోపాటు మారుతున్న ఆకాలం భవిష్యత్తును నిర్థారించటంగాని, పాలస్తీనా విప్లవానికి ఒక స్పష్టమైన సామాజిక సత్యాన్ని అపాదించటం ఏమంత సులభంకాదని" విమోచనోద్యమానికి సైద్ధాంతిక మూలాన్ని ఆపాదించడం మూలంగా అరబ్ ప్రపంచలో లేనిపోని వైరుధ్యాలు తలెత్తుతాయని అల్-ఫతా విశ్వాసం. రష్యన్-సోషల్ సామ్రాజ్య వాదానికి అనుకూలంగా వుండే అల్ ఫతా తీసుకున్న ఈ పంథామూలంగానే విమోచనో ద్యమం జోర్డాన్, లెబనాన్‌లో రియాక్షనరి పాలకవర్గాల చేతుల్లొ తీవ్ర కష్ట నష్టాలకు గురైంది.

## శతృవులెవరు? మిత్రులెవరు?

డాక్టర్ జార్జి హబ్బాష్ (George Habbash)నాయకత్వానగల పాపులర్ ఫ్రంట్ యొక్క పంథా స్థూలంగా యిది. విప్లవం శూన్యం నుండి ఉద్భవించదు. పాలస్తీనా విమోచనోద్యమం, సామ్రాజ్యవాద దోపిడికి వ్యతిరేకంగా అరబ్ పీడిత ప్రజానీకం

జరిపే విముక్తి పోరాటంలో ఒకభాగం. దాని అంతిమ ఆశయం వర్గరహిత సోషలిస్టు సమాజ స్థాపన. దళారి బూర్జువావర్గ కోవకుచెందిన అరబ్ రియాక్షనరీ పాలకవర్గాలు దీర్ఘకాలిక ప్రయోజనాలదృష్ట్యా చూసినపుడు విమోచనోద్యమాన్ని అణచివేసేందుకే ప్రయత్నిస్తాయి. ఎందుకంటే పాలస్తీనా విమోచనోద్యమ వర్గస్వభావం తమ మనుగడకే ముప్పుగనుక. అందుచేత పాలస్తీనా విమోచనం యొక్క ప్రధాన శత్రువులు మూడు. అవి- అంతర్జాతీయ సామ్రాజ్యవాదం, జియోనిస్టు విస్తరణవాదం, అరబ్ రియాక్షనరీ పాలకవర్గాలు. పాలస్తీనావారిలో వర్గాలు లేవనుకోవటం భ్రమ. పాలస్తీనా విముక్తి జరుగాలంటే కార్మిక-కర్షక సంయుక్త నాయకత్వం క్రింద స్థానభ్రంశం పొందిన (Displaced) చిన్నతరహా బూర్జువావర్గం, లాయర్లు, టీచర్లు డాక్టర్లు, విద్యార్థులు, తదితరులు ప్రాతినిధ్యం వహించే పెట్టిబూర్జువా వర్గంతోకలిపి ఒక జాతీయ ఐక్య సంఘటన ఏర్పడాలని పాపులర్ ఫ్రంట్ భావిస్తున్నది. ఇందులో భాగంగానే అరబ్ పీడిత ప్రజానీకంజరిపే విముక్తి పోరాటాలలో సంలీనం కావాలని పాపులర్‌ఫ్రంట్ ప్రగాఢ విశ్వాసం.

పాపులర్‌ఫ్రంటు నుండి చీలిపోయిన తీవ్రవాదవర్గం నాయఫ్ హవాత్‌మెన్ (Nayaf Hawathmen) నాయకత్వాన డెమోక్రటిక్ ఫ్రంటుగా రూపొందింది. పాపులర్‌ఫ్రంటు నాయకత్వం పెట్టి బూర్జువావర్గం చేతుల్లో వుందని, ఒక్క శ్రామికవర్గం నాయకత్వం క్రిందనే విమోచనోద్యమం పురోగమిస్తుందనే ఈ వర్గం విశ్వాసం. [వున్న పరిమిత సమాచారందృష్ట్యా పాపులర్‌ఫ్రంట్-డెమోక్రాటిక్ ఫ్రంట్ మధ్యగల వైరుధ్యాలను గురించి యింతకన్న వివరించడం సాధ్యంకాలేదు.] ఈ మూడుకాక అనేక యితర గెరిల్లా సంస్థలుకూడా పాలస్తీనా విముక్తికోసం పోరాడుతున్నాయి.

ఉపసంహారం : విభిన్న గెరిల్లా గ్రూపులమధ్య ఎన్ని వైరుధ్యాలున్నప్పటికి, పి. యల్. ఓ. నాయకత్వం మధ్యే మార్గవాదియైన అరాఫత్ నాయకత్వాన ఉన్నప్పటికి వాటన్నిటి ఉమ్మడి ఆశయం సాయుధ పోరాటంద్వారా విముక్తిని సాధించుటం సాయుధ పోరాటాన్ని ఒక ఎత్తుగడగా, పోరాట రూపంగాకాక ఒక పంథాగా (Line) అంగీకరించి స్వీకరించినందువల్లనే తమలో తమకున్న వైరుధ్యాలు చర్చలు, పోరాటం, ఆచరణద్వారా సమసిపోగలవన్న విశ్వాసం వారికుండబట్టే పి. యల్. ఓ. ఒక ఉమ్మడి వేదికగా పటిష్టమైన సంస్థగా మనగలుగుతున్నది. సాయుధపోరాటం ప్రధాన పోరాట పంథాగా గుర్తించిన పి.యల్.ఓ. సాయుధ పోరాటానికి అనుబంధంగా, సహాయకారిగా యితర పోరాట మార్గాల ద్వారా తన బలాన్ని పెంచుకుంటున్నది. ప్రపంచ వ్యాపి

తంగా గల విప్లవ ప్రజానీకం అండదండలు పాలస్తీనా విముక్తి పోరాటానికి లభిస్తు న్నాయి. యుద్ధము - శాంతి లేని ఒక అనిశ్చిత వాతావరణాన్ని సృష్టించి తద్వారా లాభం పొందాలని పగటి కలలు కంటున్న రెండు అగ్ర రాజ్యాల కుటిలను వమ్ము చేస్తూ, విమోచనోద్యమం ఎన్ని ఆటుపోటులకు కష్టనష్టాలకు గురైనా తప్పుల నుండి గుణపాఠాలు తీసుకొంటూనే రేపటి సూర్యుడి వెలుగుకోసం- సామ్యవాద సమతా పాలస్తీనా స్థాపనకోసం అచంచల విశ్వాసంతో ముందుకు సాగుతున్నాడు పాలస్తీనా కమాండో.

## జియోనిష్టు టెర్రరిజానికి బలైపోయిన పాలస్తీనా ప్రజాకవి ఘసన్ కన్ఫానీ

ఎక్కడ ప్రజావిముక్తి ఉద్యమం వుంటుందో అక్కడ విధిగా ప్రజాకవులు, సాయుధ పోరాటం సైనికులతోపాటు సాహితీ సైనికులు కూడా వుంటారు. జియోనిష్టు విస్తరణవాదుల నుండి పాలస్తీనా విముక్తి గావించేందుకై కొనసాగుతున్న విమోచనో ద్యమంలో రచయితలు, కవులు, కళాకారులు తమ వంతు కర్తవ్యాన్ని నిర్వహిస్తూనే వున్నారు. కాగితం పులులైన బూర్జువా పాలకవర్గాలు ప్రజల పక్షాన నిలిచిన రచయిత లపై కూడా క్రూర నిర్బంధాన్ని ప్రయోగించి తీరుతాయి. హత్యలకు కూడా వెనుదీ యవు- యిది దేశ దేశాల సత్యం. గొప్ప రచయిత, ప్రజా కవి, పాలస్తీనా దేశ భక్తుడు అయిన ఘసన్ కన్ఫానీ (Ghassan Kanfani) ప్రజల మనిషి అయినందుకు ఇజ్రేలి విస్తరణవాదులచే హత్యచేయబడ్డాడు.

అది 1972 జులై 8వ తేదీ. లెబనాన్ రాజధాని బీరూట్ నగర వీధులలో తిరుగుతున్న జనం ఒక్కసారిగా చెవులు చిల్లులుపడే శబ్దం వినపడటంతో వెనుతిరిగి చూసారు. వారికి కనపడిన దృశ్యం- దట్టమైన పొగలమధ్య తునాతునకలైన కారు, మాంసపు ముద్దలుగా మారిన రెండు మానవ శరీరాలు. ఆ రెండు శరీరాలలో ఒకటి పాలస్తీనా ప్రజాకవి, రచయిత గొప్ప దేశభక్తుడు అయిన ఘసన్ కన్ఫానీది గాను, మరొకటి ఆయన అపరిమితంగా ప్రేమించే చిన్నారి మేనకోడలు లేమ్స్ (Lames) ది గాను గుర్తించేందుకు ఆ ప్రజానీకానికి ఎంతో సేపు పట్టలేదు. ఈ సంఘటన జరిగి అరగంట కాకముందే ఇజ్రేలీ రేడియో టెలివిజన్‌లు తమ మామూలు ప్రసారాలను నిలిపివేసి 'పాపులర్ ఫ్రెంట్ ఫర్ ది లిబరేషన్ ఆఫ్ పాలస్తీనా' అధికార ప్రతినిధి ఘసన్ కన్ఫానీ బీరూట్‌లో జరిగిన ఒక ప్రేలుడు సంఘటనలో హత్యచేయబడినట్లుగా "ప్రత్యేక వార్త" ను వెంట వెంటనే ప్రసారం చేశాయి. అమెరికన్ సామ్రాజ్య వాదుల గూఢచారి సంస్థ సి.ఐ.ఎ.కు అనుబంధంగా పనిచేసే యూదు టెర్రరిస్టుల సంస్థ

'మొసాద్'కు (Mossad) చెందిన హంతకుల ముఠా ఈ దురాగతానికి ఒడిగట్టిందని అనతి కాలంలోనే ఋజువైంది.

పాలస్తీనా ప్రజలు అనుభవిస్తున్న సమస్యలలో పుట్టి, సమస్యలలో పెరిగి సమస్యలను ఆకళింపు చేసుకొని పాలస్తీనా విముక్తిని సాధించే పథంలో ఒక సాహితీ సైనికుడుగా తన వంతు పాత్రను నిర్వహిస్తూ పాసిస్టు విద్రోహానికి బలైపోయిన ఘసన్ కన్‌ఫానీ జీవిత చరిత్ర ఎంతో విలువైనది, ఆదర్శప్రాయమైనది.

1936 లో 'ఆక్రా' అనే గ్రామంలో జన్మించిన ఘసన్ కన్‌ఫానీ తన పన్నెండవ ఏటనే యూదు పెత్తందారీజానికి తట్టుకోలేక మాతృభూమి అస్తిపాస్తులను వదలి తన కుటుంబ సభ్యులతోపాటు లెబనాన్‌లోని ఒక శరణార్థ శిబిరానికి చేరుకుని, తరువాత కొలది కాలానికే సిరియా రాజధాని డమాస్కస్‌లోని శరణార్థ శిబిరానికి తరలివచ్చారు. ఘసన్ వాళ్ల కుటుంబం చాలా పెద్దది. ఆకలితో మాడుతున్న ఆ కుటుంబానికి ఘసన్, అతని అన్న యిద్దరే ఆధారమయ్యారు. పగటిపూట అంతా చిత్తు కాగితాలు ఏరుకొని వాటిని అమ్మి ఆ వచ్చిన డబ్బుతో కుటుంబ పోషణ, రాత్రిపూట బడికి పోవటం-యిదీ ఘసన్ దినచర్య. యిలా నాలుగు సంవత్సరాలు మాత్రమే జరిగింది. తన పదహారవ యేటనే ఘసన్ తన విద్యాభ్యాసానికి స్వస్తిచెప్పి శరణార్థ శిబిరాలలో ఐ.రా.స. నిర్వహించే పాఠశాలలో ఉపాధ్యాయ వృత్తిని చేపట్టాల్సివచ్చింది. ఘసన్, మరో ఉపాధ్యాయుడు కలసి దాదాపు 1200 మంది శరణార్థి బాలబాలికలకు, పాఠాలు చెప్పాల్సి వచ్చింది. ఘసన్ దృష్టిలో పాఠాలు చెప్పటం అంటే చదవటం, వ్రాయడం నేర్పడం మాత్రమే కాదు. రాజకీయంగా వారిని చైతన్యవంతులను చేయడంద్వారా పాలస్తీనా విమోచనోద్యమంలో వారిని భాగస్వాములుగా చేయడం. ఈ ఆశయ సాధనలో ఘసన్ సఫలీకృతుడయ్యాడని చెప్పేందుకు నిదర్శనం ఆయనవద్ద విద్య నభ్యసించిన వారిలో అధికభాగం తరువాత పాలస్తీనా కమాండోలుగా మారటమే.

ఘసన్ కన్‌ఫానీకి మొదటి నుండి రచనా వ్యాసంగం మెండు. అందుచేతనే ఒకప్రక్క ఉపాధ్యాయ వృత్తిలోవుంటూనే మరోప్రక్క 'అరబ్' జాతీయవాదుల ఉద్యమం (Arab National Movement) అనే సంస్థలో సభ్యుడుగా చేరి ఆ సంస్థ అధికార పత్రిక అల్-రాయ్ (Al-Rai) సంపాదక వర్గంలో స్థానం సంపాదించుకున్నాడు. మరుసటి సంవత్సరమే డమాస్కస్ వదలి తన సోదరివద్ద వుంటూ మార్క్స్,ఎంగిల్స్, లెనిన్, స్టాలిన్, మావోల రచనలను అధ్యయనం చేయటం ప్రారంభించాడు. తీరిక సమయాలలో రచనలుచేసి అల్-రాయ్ పత్రికకు పంపేవాడు. ఈ కాలంలో ఘసన్

పూర్తి మార్క్సిస్టుగా పరిణతచెంది 1960 లో స్వేచ్ఛ (Al-Hurriah) అనే వామపక్ష పత్రిక సంపాదక బాధ్యతలు స్వీకరించేందుకై లెబనాన్ రాజధాని బీరూట్ చేరుకొని అక్కడే స్థిరపడి హత్యకావించబడేవరకు అక్కడనుండే తన రాజకీయ సాహిత్య కార్య కలాపాలు నిర్వహించాడు. 'స్వేచ్ఛ' సంపాదకుడుగా వున్న తరుణంలో బీరూట్ సంద ర్శించిన డేనిష్ దేశస్థురాలు అన్నే (Anne) తో ఘసన్ పరిచయం అయింది. ఆ పరి చయమే తదుపరి ప్రేమగా మారి వారి వివాహానికి దారితీసింది.

1962 లో ఘసన్ యొక్క ప్రప్రథమ నవల (Men in the Sun)వెలువడింది. 1963లో అల్-ముహర్ (Al-Muharrer, అనే మరో నాజరైట్ దినపత్రిక సంపాద కత్వం కూడా ఘసన్ చేపట్టాడు. అనతికాలంలోనే ఆ పత్రిక లెబనాన్‌లోని రెండో పెద్ద దినపత్రికగా రూపొందింది. 'పాలస్తీనా' అనే ఒక వారపత్రికను కూడా ఘసన్ ప్రారంభించాడు. 1965 లో ఘసన్ చైనా భారత దేశాలను సందర్శించి పాలస్తీనా సమస్య గురించి విస్తృతంగా ప్రచారం చేశాడు. 1967 లో అల్-అన్వర్ (Al-Anvar) అనే మరో ప్రసిద్ధ అరబ్ దినపత్రికలో ఆదివారం అనుబంధపు సంపాదక బాధ్యతలను కూడా స్వీకరించాడు. అప్పటికే ఘసన్ ఒక మంచి పత్రికా రచయితగా అరబ్ పత్రికా రంగంలో ప్రముఖ స్థానం పొందాడు. అల్ అన్వర్‌లో ఆయన ఎడిట్‌చేసే 'తెర వెనుక భాగోతం' (Behind the Screnes) అనే శీర్షిక ఆ పత్రికకే మంచి పేరు తెచ్చింది.

1968 నాటికి పాత్రికేయుడుగానేకాక రాజకీయంగాకూడ ఘసన్ మరింత ఎక్కువ బాధ్యతలు మోయాల్సి వచ్చింది. పశ్చిమాసియా మార్క్సిస్టు-లెనినిస్టుగా పేరెన్నికగన్న డాక్టరు జార్జి హబ్బాన్‌చే స్థాపించబడిన పి. యఫ్. యల్. పి. లో చేరి ఘసన్ దాని అధికార ప్రతినిధి అయ్యాడు. పాపులర్ ఫ్రంటుయొక్క రాజకీయాలను తీవ్రంగా ప్రచా రంచేయాలనే వుద్దేశ్యంతో మిగతా పత్రికలతో తనకున్న సంబంధాలను తెగతెంపులు చేసుకొని 'గమ్యం' (Al–Hadaf) అనే నూతన వారపత్రికను 1969లో ప్రారం భించాడు. పాపులర్ ఫ్రంటుయొక్క ఆశయాలనేకాక వామపక్ష శక్తుల ఆశయాలను ప్రతిబింబించే 'గమ్యం' అనతికాలంలోనే మిక్కిలి ప్రజాదరణ పొందింది. 'లీమాండే' వంటి ఫ్రెంచిపత్రికలు, యితర పాశ్చాత్య పత్రికలు 'గమ్యం'లోని వ్యాసాలను పున ర్ముద్రించ సాగాయి.

ఒకప్రక్క పత్రికారంగంలో పనిచేస్తూనే మరోప్రక్క సాహితీరంగంలో కూడా ఘసన్ తీవ్రకృషి సల్పాడు. పాలస్తీనా సాహితీ రంగానికి ఘసన్‌చేసిన కృషి

యింతవరకు మరెవ్వరు చేయలేదు. ఘసన్‌కు చిన్నపిల్లలంటె వ్యామోహం మెండు. 1969లో 'మనదికాని ప్రపంచం' (A World Which is not ours) అన్నపేరుతో ఒకచిన్న కథల సంకలనాన్ని ప్రచురించి దానిని "ఫాయెజ్, లేమ్సు, మరందరిపిల్లలు, ఎవరికోసమైతే మనంఒక ప్రపంచాన్ని కోరుతున్నామో" వారికి ఆ పుస్తకాన్ని అంకితాన్ని చేశాడు. [ఫాయెజ్ లేమ్సులు ఘసన్ యొక్క కొడుకు మేనకోడలు] అదే సంవత్సరం "పాలస్తీనాలో ప్రతిఘటనా సాహిత్యంపై వ్యాసాలు" అనే పుస్తకం ప్రచురించి ప్రప్రథమంగా ఆక్రమిత పాలస్తీనాలోగల రచయితలను కవులను వెలుగులోనికితీసుకు వచ్చాడు.

1969లో ఘసన్ రచించిన నవల ఉమ్‌సాద్ (Umm Sa 'ad') ఎంతో ప్రఖ్యాతిచెందినది. నవలా ప్రపంచంలో అదిఒక నూతన ప్రయోగంకూడా. ఉమ్‌సాద్ ఒక శ్రామికవర్గపు మహిళ శరణార్థ శిబిరాలలో ఉంటూఉండేది. పాలస్తీనా మహిళా ప్రపంచానికి ఏవర్గం కోసమైతే పీడిత ప్రజారచయితలు రచనలుచేసి కృషిచేస్తున్నారో ఆ వర్గానికి ప్రతినిధిగా ప్రతీక (Symbol)గా ఘసన్ ఆమెను స్వీకరించి నవల రచించాడు. ఆ నవలలో చాలాభాగము ఘసన్‌కు, ఉమ్‌సాద్‌కు మధ్యజరిగే చర్చకే కేటాయించబడింది. అయితే ఇందులో విశేషమేమిటంటే నిరక్షరాస్యురాలైన ఉమ్‌సాద్ అన్ని విషయాలను కూలంకషముగా వివరించి తనఅనుభవాలు చెబుతూవుంటే మేధావి [ఘసన్] వింటూకూర్చుని అనుమానాలువస్తే ప్రశ్నిస్తుంటాడు. 'ప్రజలనుండి నేర్చుకోవటం' గురించిన మార్క్సియన్ అవగాహనను ఘసన్ ఈ నవలలో ఎంతోచక్కగా వుదహరించాడు. 'మేం మేధావులం' అంటూ చంకలుగ్రుద్దుకొని స్వీయమానసికధోరణికి లోను కాకుండా ప్రజల అనుభవాలను భావాలను మేధావి పరిగణలోనికి తీసుకోవాలని ఆ నవల ద్వారా ఘసన్ తెలియచెప్పదలచుకొన్నాడు. 1970లో మరియొక నవల 'తిరిగిహైఫాకు' (Back to Hypha) రచించాడు. 1967లో బీరూట్‌లో జరిగిన ఆఫ్రోఏషియా ప్రజల సంఘీభావ మహాసభలో పాల్గొని 'ఆక్రమిత పాలస్తీనాలో ప్రతిఘటనా సాహిత్యం' అనే డాక్యుమెంటును సభకు సమర్పించారు.

ఒక అరబ్ రియాక్షనరీ ప్రభుత్వాన్ని గురించి తన పత్రిక 'గమ్యం'లో కొన్ని వ్యాఖ్యలు చేసినందుకుగాను 1971 అక్టోబరులో ఘసన్ అరెస్టు అయ్యాడు. జైలులో ఉన్నకాలంలో 'ది లవర్' (The Lover) అన్న తన నవలను ప్రారంభించాడు. ఆ నవలను బ్రిటిష్ వలస పాలకుల వలసాధిత్యపు పాలననుండి నేటివరకు కొనసాగిన పాలస్తీనా విమోచనోద్యమము యొక్క దర్పణంగా రూపొందించాలని ఆయన సంకల్పం.

పాలస్తీనా ప్రజానీకంలోగల విభిన్న వర్గాలవారిని, 1937 లగాయతు కమాండోలుగా వున్నవారిని ఆయన అంతకుముందే ఇంటర్వ్యూ చేసి ఆ నవలకు సరిపడ కథావస్తువును గూడా రూపొందించుకున్నాడు అయితే ఆ నవల పూర్తిగాక మునుపే ఆయన హత్య గావింపబడటంతో ఆ నవల అసంపూర్తిగానే మిగిలిపోయింది. ఆయన మరణానంతరము ఆ అసంపూర్తి నవలే ముద్రించబడి అశేష ప్రజాదరణ పొందింది.

ఘసన్ యొక్క ఆశయాలను గురించి ఆయన భార్య అన్నే కన్‌ఫాని ఇలా అంటుంది "పాలస్తీనా ప్రతిఘటనోద్యమాన్ని జాతీయ వాద విమోచనస్థాయిల నుండి (From a Nationalist Palestenian Liberation in to a Pan-Arab Revolutionary Socialist Movement) పాన్/అరబ్ సోషలిష్టు విప్లవంగా అభివృద్ధిపర చాలని భావించి అందుకై కృషిసల్పినవారిలో ఘసన్ ఒకడు. అరబ్ ప్రపంచ రాజకీయ సామాజిక పరిస్థితులలో ప్రమేయంలేకుండా పాలస్తీనా సమస్య పరిష్కారంకాదు అని ఆయన ఎప్పుడూ నొక్కి చెప్పేవాడు "ప్రతి దినం అతని సహచరులు (Comrades) పోరాటంలో ప్రాణాలిస్తున్నారు లేదా ఇజ్రేలి జైళ్ళల్లో చిత్రహింసలకు బలిఅవుతున్నారు పాలస్తీనా విప్లవం గురించి ప్రపంచానికి చెప్పటం ఆయన బాధ్యత" ఈ బాధ్యత గుర్తించేందుకే ఆయన శత్రువు కన్నెర్రకు గురిఅయ్యాడు. బూర్జువా పాలకవర్గాలకు సాయుధపోరాట సైనికులంటే ఎంతభయమో, సాహితీ సైనికులంటే అంతే భయం. ఏ బూర్జువా ప్రజాస్వామిక న్యాయమైతే ఇక్కడ భారతదేశంలో కామ్రేడ్స్ సరోజ్‌దత్తా, పరిటాల శ్రీరాములు, సుబ్బారావు పాణిగ్రాహి లాంటి వారలను పొట్టన పెట్టుకొన్నదో, అదే బూర్జువా ప్రజాస్వామిక న్యాయాన్ని ఆచరిస్తున్న ఇజ్రేలీ విస్తరణవాదులు ఘసన్ కన్‌ఫానీని పెట్టుకొన్నారు. అమెరికాకు చెందిన 'ది డైలీ స్టార్' అనే పత్రిక జులై 9, 1972 సంచికలో [ఘసన్ హత్య చేయబడిన మరుసటి దినం] ఆయన హత్యకుగల కారణాన్ని యిలా వివరించారు "ఘసన్ ఎన్నడూ తుపాకి పేల్చని కమెండో. ఆయన ఆయుధం ఒక బాల్ పాయింట్ పెన్. పరిధి పత్రికలు కాగితాలు. అయినా ఒక కమెండోల బృందంకన్నా ఎక్కువగా శత్రువును దెబ్బతీయ గలడు" ఘసన్‌భార్య మాటలలో చెప్పాలంటే "ఆయన అభివృద్ధి చెందుతున్న దశ లోనే వారు ఆయనను హత్యచేశారు. ఒక పత్రికారచయితగా, వ్యాఖ్యాతగా (Spokesman) ఒక కళాకారుడిగా, ఒక సజీవమైన మనిషిగా ఆయన వారికి యెంతో ప్రమాదకారి" "జీవిత మంతే ప్రేమ హింసను అనివార్యం చేస్తుంది. ఘసన్ Pacifist కాడు. రోజా లగ్జంబర్గ్‌లాగా (Rosa Luxemburg), ఎర్నెస్ట్ థాల్‌మన్ లాగా (Ernest Thalman), లుముంబా, చేగువెరా లలాగా ఆయన కూడా వర్గపోరాటంలో

# సాహిత్య "స్వాతంత్ర్య" వాదం

'రమ'

ఆధునిక సాహిత్య విమర్శలో ప్రధానమైన ఒక ధోరణి విమర్శను సాహిత్య పరంగా మాత్రమే సాగిస్తూ, సాహిత్యంతో సంబంధంలేని విషయాలను పూర్తిగా వదిలి వెయ్యడం. ఒక రచన అంతర్గత నిర్మాణం, భావ చిత్రాలు, పాత్ర పరిశీలన, కథా వస్తు విశ్లేషణ, యిలాంటి వాటినే అంటిపెట్టుకుని, సాహిత్యేతరమైన వాటికి ప్రవేశం కలిగించకపోవడం దీని లక్షణం. సాహిత్యానికీ కళలకూ సమాజమే మూలాధారం అనే విషయాన్ని అటుంచినా, కొన్ని కొన్ని సాహిత్య విషయాల వివరణకు సామాజిక దృక్పథం చాలా సహాయం చేస్తుందని కూడా కొందరు గుర్తించడం లేదు. అంటే, సాహిత్యం మడిగట్టుకు కూర్చుంటుందన్న మాట. నిజానికి, మానవ సమాజంతో ప్రమేయంలేని సాహిత్యమే వుండదు. అది సమాజశాస్త్రంగా పరిణమించ వలసిన పనిలేదు గాని, సామాజికశాస్త్ర వైఖరిని కంటగించుకోవడం, సాహిత్యానికి ఆత్మాపచారమే. సమాజ జీవిత మూలాలను, మానవుల సామాజికానుభవాలనూ అనుభూతులనూ ప్రదర్శించడం, కళగా సాహిత్యానికి తప్పనిసరి. అవి రెండూ ఒక్కటి కానంత మాత్రాన, పూర్తిగా వేర్వేరనీ పరస్పర బాహ్యాలనీ భావించడం తప్పు. విడిగా దేనికది వుంటూ వస్తున్నా, ఒకదాని ప్రభావం మరొక దానిపై పడి, తద్వారా రెండూ సమగ్రతను పొందుతున్నాయి.

సాహిత్యం అంటే యుగదర్పణం మాత్రమే ననేవాళ్లు కొందరున్నారు. ఆయా కాలాలలో సమాజ జీవితాన్ని ప్రతిబింబిస్తూ వుంటుందని వాళ్లంటారు. రచయిత

---

చంపబడ్డాడు. వారు జీవితాన్ని ప్రేమించినట్లే ఆయనకూడా ప్రేమించాడు. దోపిడివర్గాల నిర్బంధానికి వ్యతిరేకంగా జరిగే ఆత్మరక్షణ క్రమంలో విప్లవాత్మక హింసయొక్క (Revolutonary Violence) అవశ్యకతను వారందరిలాగే ఆయనకూడా గుర్తించాడు.

ఘసన్ కన్‌ఫానీ అంతిమ యాత్రలో అన్నివర్గాలకు చెందిన ప్రజానీకం లక్షల సంఖ్యలో పాల్గొన్నారు. పశ్చిమాసియా చరిత్రలో నాసర్ అంతిమ యాత్ర తర్వాత యింతపెద్ద సంఖ్యలో ప్రజానీకం మరేయితర సందర్భంలోను హాజరుకాలేదని ఆనాడు పత్రికలన్నీ రాశాయి. ఆ ప్రజానీకమంతా ముక్తకంఠంతో "ఏ ఆశయసాధనకోసమైతే ఘసన్ కన్‌ఫానీ తన జీవితాన్ని అంకితం చేశాడో ఆ ఆశయ సాధనకోసం తుదికంటా పోరాడు తామని" ప్రతిజ్ఞ చేసారు. అందుకే ఘసన్ కన్‌ఫానీ మరణం వృథాకాని మరణం రేపటి సూర్యుని కిరణం.

—రవి

సృష్టించే పాత్రలు, ఘటనలు, కథ వగైరా వూహాకల్పితమే కావచ్చు గాని వాటికి ఒకానొక చారిత్రక వాతావరణం వుంది. వ్యక్తిపరం అనిపించేవి కూడా సామాజిక మైనవే. అలా వాటిని మార్చడమే సామాజికశాస్త్ర వైఖరిగల సాహిత్య పరిశీలకుని కర్తవ్యం అని వీరి వాదం.

అయితే, సాహిత్యం సమాజ శాస్త్రానికి ముడిసరుకు మాత్రమేనా? సాహిత్యాన్ని మాత్రమే ఆధారం చేసుకుని సమాజ జీవిత దృశ్యాలను పునర్నిర్మించగలమా? ఇలాంటి ప్రశ్నలు వేసుకుంటారు మరి కొందరు. సాహిత్యం ప్రతిబింబించేది సరిగ్గా దేన్ని? అప్పటంగా సమాజ జీవితాన్ని అచ్చు గుద్దుతుందా సాహిత్యం? అద్దం జడపదార్థం. బింబానికి ప్రతిబింబాన్ని యాంత్రికంగా అది తయారుచేస్తుంది. రచయిత పట్టి అద్దమే కాదు. సమాజ జీవిత అనుభవం అదే రూపంలో సాహిత్యంగా బయల్పడదు. అతని అనుభూతులతో అది కొంత మార్పుచెందుతుంది. సమాజ జీవితంలో అంతర్లీనంగా వున్న విలువలను, అంతరార్థాలను సాహిత్యం ద్వారా చూపెట్ట గోరు తాడు రచయిత. కాబట్టి సమాజాన్ని యథాతథంగా ప్రతిబింబించడు. తన వుద్దేశాలను అభిప్రాయాలను ఈ చిత్రణలో చొప్పిస్తాడు. సాహిత్యానికి విశిష్టత చేకూరేది యిలాగున్నే అంటారు వీళ్లు.

రచయితకూడా సమాజజీవే అయినప్పుడు, సామాజిక పరిస్థితినుంచి తానూ తన రచనలూ స్వతంత్రించలేవు. సామాజికమైన మార్పులు అతని రచనలనుతాకి విడువక తప్పదు. రాజులో సామంతులో పోషకులుగా వుండినరోజుల్లో, విద్యా విజ్ఞానాలు బహు కొద్దిమందికే అబ్బినరోజుల్లో, రచయిత పరిస్థితి ఒకవిధంగా వుండేది. పాఠకులంతా కలిసి పిడికెడుమందే. వారికీ తనకూ భావసారూప్యం వుంటూవచ్చింది. ఆధునిక కాలంలో అచ్చువచ్చి, పాఠకుల సంఖ్యపెరిగి, వెనకటి పోషణస్థానే బహుజనాదరణ లభించి "పాఠకోత్తము"లకు బదులు పాఠకులుసైతం సాహిత్యాన్ని ఆదరిస్తున్నప్పుడు, మధ్యతరగతి ప్రాబల్యంమూలానా సంస్కృతి 'ప్రజాస్వామిక' రూపం ధరించింది. సాహిత్యం యిప్పుడు స్వతంత్రప్రవృత్తి కాగలిగింది. ఈమార్పులతో సరిపెట్టుకున్న రచయితలు మధ్యతరగతి విలువలకు తమరచనలలో పట్టంకట్టారు. హేతువాదాన్ని సమర్థించారు. పారిశ్రామికీకరణ సరిపడని రచయితలేమో సమాజానికి పెడమొగంపెట్టి, సమకాలిక జీవితవిధానాన్ని హర్షించలేకుండా నిరసన వైఖరిని అలవరుచుకున్నారు. ఈ కొత్తవర్గం తాలూకు విలువలను సవాలుచేశారు. పితూరీలు లేవదీశారు. సాహిత్యం ద్వారా, అయితే వీరిలోకొందరు వెనక్కు, మరికొందరు ముందుకు, చూపులు సాధించారు.

సమాజానికీ సాహిత్యానికీ మధ్యగల సంబంధాన్ని గురించి ఆధునిక కాలంలో మొదట క్రమబద్ధంగా చర్చించింది, ఫ్రాన్స్ దేశానికి చెందిన హిప్పోలిట్ టెయిన్ (1828-93). అంతకుముందు, జర్మనీకి చెందిన హెర్డర్‌లాంటి సాహిత్య తాత్వికులు చేసిన సిద్ధాంతాల ప్రకారం, ఒకదేశపు సాహిత్యంమీద ఆ దేశం తాలూకు వునికీ, మనికీ దాని భౌతిక వాతావరణం, సామాజిక పారిసర్యం వగైరాల ప్రభావం బలంగా వుంటుంది. సాహిత్యంలో స్వతంత్రమైన విలువలు ఏవో నిక్షిప్తమై ఉన్నాయని వాటికోసం గాలించడం అనవసరం. జాతి సంస్కృతిలో సాహిత్యం సహజమైన అంతర్భాగమే అయినప్పుడు, భౌతిక, సామాజిక పరిస్థితులనుంచి అది స్వతంత్రించడం కల్ల. యుగ హృదయాన్నో, జాతి హృదయాన్నో అది వినిపిస్తుందేగాని విడిగా దానికొక గొంతుకేదీ లేదు. ఇలా విపరీతసిద్ధాంత మొకటి చేశాడు హెర్డర్.

సాహిత్యంమీద మతానికీ, సామాజికాచారాలకూ, చట్టాలకూగల ప్రభావాన్ని వివరించేందుకు ఫ్రెంచి రచయిత్రి మదాందస్టాయెల్ ప్రయత్నించింది. ఈవైఖరి యాంత్రికమైనదని చెప్పవలసిన పనిలేదు. ఆదిమ కాలాన గణముఖ్యులే ఒకచేత్తో చట్టాలూ మరోచేత్తో నానాకళలూ రూపొందించే వారన్నట్టుగా అడంస్మిత్ ఒక ఊహా ప్రతిపాదన చేశాడు. మనిషి సహజంగానేకవి. కవిత్వం మానవుని హృదయాంతర భావాల వ్యక్తీకరణం, అన్నాడు ఫెర్గుసన్. చరిత్ర ప్రారంభకాలంలో మతాచార్యులూ రాజ్యాధినేతలూ తత్వవేత్తలూ తమ ఆదేశాలనూ బోధనలనూ కావ్యరూపంలోనే వెలయించారని, పోను పోనూ సమాజం భిన్నమై వేర్వేరు వృత్తులు తలెత్తాక ఒక్కొకుదురుగా వుంటూవచ్చిన కళలు విడిపోయాయని, మనుషులు చరిత్రక్రమానికి విధేయులైపోకతప్పలేదని కూడా ఫెర్గుసన్ వివరించాడు. శ్రమవిభజనకు గల సామాజిక ప్రాముఖ్యాన్ని మార్క్సుకంటె ముందు, అస్పష్టంగానైనా, గుర్తించాడన్నమాట. సరుకుల వుత్పత్తి ఫలితంగా, సాహిత్యంకూడా ఒక బృందానికి పరిమితమైంది. ఇది అసంకల్పిత ఫలితమే అయినా, ఫలితమే. వర్తక, వాణిజ్యాలు పెరగడంతో, సాహిత్యం ఒక వృత్తి అయింది. రచన ఒక సరుకూ అయింది. పరాయీకరణ (alienation) విషయంలో మార్క్సుచేసిన సిద్ధాంతానికి ఫెర్గుసన్ ప్రతిపాదన ఒక సూచనలాంటిదని అనుకోవచ్చు. సమాజజీవితంలో వర్తకం, పరిశ్రమల లాంటిమార్పులు ప్రవేశించి స్థిరపడ్డాక, అంతవరకూ సామాజిక జీవితంతో పెనబడివుంటూ వచ్చిన మనుషులూ, వారి కళలూ నైపుణ్యాలూ సమాజ జీవితంనుంచి వూడలాగినట్టుగా వేరుబడిపోతాయి. పరాయివై పోతాయి.

జర్మనీకి చెందిన షిల్లర్ కూడా యిలాంటి వాదమే చేసాడు. ఆర్థిక జీవితంలో ఏ వృత్తికావృత్తి వేరుబడి సంకుచిత పరిధికి లోబడి, అలాగే వర్తక వాణిజ్యాలలో

స్పర్థలూ కలహాలూ తీవరించడంతో, 'సౌందర్య పరమైన నాగరికత' నాశనమయిందనీ, దీనికంతకూ శ్రమ విభజన మూలకారణమనీ షిల్లర్ వాపోయాడు. మనిషికీ ప్రకృతికీ మధ్య గండి పడిందన్నాడు. మనిషి కిలా మనస్తాపం కలిగింది. దీన్ని వుపశమింప జేయాలంటే, మనిషి ప్రకృతిని స్వచ్ఛందంగానూ సౌందర్యానుభూతి భావంతోనూ 'కేళి'గా వీక్షించాలని చెప్పాడు. మనిషి హృదయానుభూతికీ మేధోభివృద్ధికీ మధ్య మళ్లీ కళ ద్వారానే పొందగలడని అన్నాడు.

'సజీవ ప్రకృతి నుంచీ, ఇతర మానవుల నుంచీ మనిషి పొందిన వేర్పాటు గురించి హెగెల్‌కూడా రాశాడు. ఇతిహాసకావ్యాల (ఎపిక్)లో, ఆనాటి జాతిహృదయం కనిపిస్తుందని, ఈనాళ్లలో నవల అలాంటి పని చెయ్యగలదని, యిది మధ్యతరగతి జీవిత యితిహాస కావ్యమైనా పద్యరూపంలో గాక వచన రూపంలో వుంటున్నదని హెగెల్ అన్నాడు. శ్రమవిభజన తెగ ముదిరిన ఫలితంగా ఆధునిక సమాజం ముక్కచెక్కలై పోయివుంది, యీ అనైక్యతనూ భిన్నతనూ బాగా ప్రదర్శించగలిగిన సాహిత్య రూపం నవలేనని హెగెల్ అభిప్రాయం.

సాహిత్యానికీ సమాజానికీ గల గాఢమైన, జటిలమైన సహజానుబంధం గురించి క్రమబద్ధంగా ఆలోచించింది ఆధునిక యుగంలో టెయిన్ అని మీదను చెప్పడం జరిగింది. సమాజ శాస్త్రదృష్ట్యా ఆయన సాహిత్యాన్ని పరిశీలించాడు. ప్రకృతి శాస్త్రాలలో భౌతిక శాస్త్రాలలో అనుసరించే పద్ధతులను కళా, సాహిత్యాలకు అన్వయించేందుకు ప్రయత్నించాడు. సాహిత్యం అనేది సమాజం తాలూకా భౌతిక పునాదులపై నిలిచిందేగాని, రచయితల వైయక్తిక ప్రతిభాఫలితమో, వూహాకల్పితమో కాదనీ, సమకాలిక ఆచార వ్యవహారాలకు అక్షరరూపమేననీ ఒకనొక విధమైన మనస్థితిని అది వెల్లడిస్తుందనీ, టెయిన్ అన్నాడు. అయితే యిది శుష్కబింబ ప్రతిబింబ పద్ధతిలో జరగదు. సాహిత్యం సమాజ జీవిత పత్రమైనంత మాత్రాన, దానికి విశిష్టత లేకపోదు. కళాకారుడు తన యుగానికి జనానికీ సంబంధించిన జీవితంలోకి ఎంతలోతున చొరబారగలిగితే అతనికళ అంత గొప్పగా రూపొందుతుందని టెయిన్ ఒక సిద్ధాంతం చేశాడు. ప్రతిభావంతుడే సాహిత్యం ద్వారా తన జాతి జీవితానికి అక్షరసాక్ష్యం సమకూర్చగల డన్న మాట. జాతిదినుసు (రేస్), కాలపరిస్థితి (మమెంట్), భౌతిక, సామాజిక పారిసర్యం (మిల్యూ)- యీ మూడింటి కూడిక మూలంగా ఒకానొక విలక్షణమైన భావ వైఖరి యేర్పడుతుందని, ఆయా యుగాలకూ, శకాలకూ అనువైన 'మూలభావాలు' యీ వైఖరి నుంచి రూపొంది, గొప్ప కళా, సాహిత్యాలలో వెల్లడికాగలవని టెయిన్ సూత్రీ

కరణ చేశాడు. అంటే, సమాజమూ సాహిత్యమూ నేరుగా మొరటుగా బింబ ప్రతిబింబ రూపంలో వుండవన్నమాట. జాతిదిణుసు, కాలపరిస్థితి, సామాజిక పరిసరం, యివి కళా, సాహిత్యాలకు భౌతికంగా మూలాధారమే గాని, వాటికవి యాంత్రికంగా తక్షణ ఫలితాలుమాత్రం కానక్కర్లేదు. వీటిమధ్య పూర్తిగా కార్యకారణ సంబంధంవుండదు. భౌతిక విషయాలలో శీతోష్ణస్థితి, దేశం భౌగోళికమైన వునికి, విద్యుయాత్మకశక్తి కలిగిన వేనని టెయిన్‌భావం. మనిషికి వాటినుంచి స్వాతంత్ర్యం అసంభవం. ఆర్థిక విషయాలనుగూడా టెయిన్ ప్రస్తావించడం జరిగింది. సాహిత్యాన్ని కళలనూ సరిగా అభిమానించి ఆదరించే వారినిబట్టి అవి తమరూపాన్ని మార్చుకుంటాయని మరొక సూత్రీకరణ చేశాడు టెయిన్. అయితే, యీపద్ధతిలో యాంత్రికత ముఖ్యమైనలోపం. భౌతిక పరిస్థితులకు నేరుగా వెంటనే ప్రతిస్పందిస్తాయని చెప్పడం, సాహిత్యాది కళారూపాలకుగల విశిష్టతను, వాటి నిర్మాణంలో దాగివున్న జటిలతను గమనించక పోవడమే. గొప్ప రచయితల విషయంలో మాత్రం, టెయిన్ తన సూత్రీకరణలను తానే వుల్లంఘించాడు. ఒకగొప్ప కళాకారుడి 'నైతిక స్థాయి' మరింత వున్నతంగా వుంటుంది కాబట్టి అతడు వాస్తవ జీవిత సారాన్ని గ్రహించి నిండుగా ప్రకటించగలడని టెయిన్ అభిప్రాయం. యాంత్రిక భౌతికవాదసూత్రం యిలా తెగిపోయి, ఉత్తమ కళాసృజనకు ఎంతో కొంత స్వయం ప్రతిపత్తి చేకూరినట్లయింది. మొత్తంమీద మాత్రం, టెయిన్ దృష్టికి సాహిత్యాది కళలన్నీ సమాజ జీవితానికి సాక్ష్యాధారాలు సమకూర్చే పత్రాల వంటివే. వాటి కళాత్మక విషయం టెయిన్‌కు పట్టలేదనే చెప్పాలి. కళాకారుడు మంచిచూపున్న జీవిత పరిశీలకుడు. తన పరిశీలనలకు కళారూపం యిచ్చే శక్తి అతనికి వుంది, అంతే.

పారంపర్యం, ఆనువంశిక ప్రభావం, సృజనాత్మక ప్రతిభ- ముఖ్యంగా యీ మూడింటి వ్యక్తీకరణమే సాహిత్యమని టెయిన్ అనగా, మార్క్స్-ఎంగెల్సులు ఆర్థిక విషయాలకే అధిక ప్రాముఖ్యమిస్తూ ఆ దృక్పథం నుంచి సాహిత్యాన్ని దర్శించడం జరిగింది. దీని గురించి టెయిన్‌లాగా వీళ్లిద్దరూ ఒక సమగ్ర సిద్ధాంతాన్ని ప్రతిపాదించలేదు. మార్క్సిస్టులు ఈ పనికి పూనుకున్నారు గాని, సామాజిక వ్యవస్థకు సాహిత్యాది కళల నన్నింటినీ యాంత్రికంగా లోబరచివేసే పాక్షిక వైఖరినే ప్రదర్శించారు. సాహిత్య రూపాన్ని వస్తువే పూర్తిగా నిర్ణయించగలదని, మరి సాహిత్య వస్తువును నిర్ణయించేది వర్గశక్తుల నిర్దిష్ట పరిస్థితి అని, లూనచాల్‌స్కీ వంటి మార్క్సిస్టులు పిడివాదం చేశారు. మార్క్స్-ఎంగెల్సులు మాత్రం ఇంత మొండి బండ వైఖరిని అవలంబించ లేదు. వారి తొలి రచనల నిండా కనిపించేది, భావజాలానికీ శ్రమవిభజనకూ గల సర్వ వ్యాప్తమైన ఫలితాలు. ఆలోచనా సరళినీ భావజాలాన్నీ బలంగా రూపొం

దించేది మానవ సమాజం. రచయిత వర్గ వైఖరినిబట్టి, ప్రపంచాన్ని పాక్షికంగానూ పక్షంగానూ అతడు చూడగలుగుతాడు. నిశ్చితమైన చారిత్రిక పరిస్థితులలోనే, నిర్దిష్టమైన సామాజిక జీవిత సందర్భాలలోనే, "భావజాలానికి" సంబంధించిన మనోగత చర్యలు రూపొందగలవని 'జర్మన్ ఐడియాలజీ'లో వాళ్లు రాయడం జరిగింది.

"భావాలు, వస్తువుల గురించిన భావరూపాలు (కాన్‌సెప్ట్స్), చైతన్యం— వీటి తయారీ మొదట్లో మనుషుల భౌతిక కార్యకలాపంతోను, భౌతిక సంపర్కంతోను, యథార్థ జీవిత భాషలో, నేరుగా అల్లుకుపోయి వుంటుంది. మనుషుల వాస్తవ ప్రవర్తన నుంచి మనోగత వస్తు భావనలేమి, ఆలోచనలేమి, మనస్సంపర్కమేమి, నేరుగా వెలువడుతున్నట్లు ఈ దశలో అనిపిస్తుంది. రాజకీయాల, చట్టాల, నీతి విషయాల, మతవిశేషాల, ఆధ్యాత్మిక విషయాల తాలూకు భాష ప్రకటించే మనోభావ నిర్మాణానికి గూడా యిదే వర్తిస్తుంది. ఉత్పత్తి శక్తుల నిశ్చిత అభివృద్ధి స్థాయి ప్రభావానికి లోబడక తప్పని యథార్థ, క్రియాశీల మానవులు తమ మనోగత భావాలకు తామే నిర్మాతలు. ....యథార్థ, క్రియాశీల మానవులతో మొదలుపెట్టి, వారి యథార్థ జీవితక్రమం ఆధారంగా ఈ జీవితక్రమం యొక్క భావజాల సంబంధమైన మనోచర్యలనో (రిఫ్లెక్సెస్) ప్రతిచర్యలనూ ప్రదర్శిస్తాము. మానవుని మెదడులో ఏర్పడే భావాకృతులు (Phantoms) అవశ్యంగా వారి భౌతిక జీవిత క్రమాన్ని బట్టి రూపొందే ఆచ్ఛిక విషయాలే (సబ్లిమేట్స్). ఈ భౌతిక జీవనక్రమాన్ని అనుభవరీత్యా (ఎంపిరికల్) నిరూపించవచ్చు. ఇది భౌతిక అభ్యూహాలతో (ప్రెమిజెస్) ముడిపడివుంది. నీతి విషయాలు, మతం, ఆధ్యాత్మిక విషయాలు, భావజాలంతోగల తక్కినవి అన్ని, వాటికి అనుగుణంగా వుండే చైతన్యరూపాలు, యిలా మరేమాత్రం స్వాతంత్ర్యాన్ని పోలిన దాన్ని దేన్నీ నిలబెట్టుకోవు. వాటికి చరిత్రగాని, అభివృద్ధిగాని వుండదు. తమ భౌతిక వుత్పత్తిని, భౌతిక సంపర్కాన్నీ వృద్ధిపొందించుకుంటూ మానవులు తమ వాస్తవ జీవితంతో బాటుగా, తమ ఆలోచననూ ఆలోచనా ఫలితాలనూ మార్చుకుంటారు. చైతన్యం జీవితాన్ని గాక, జీవితమే చైతన్యాన్ని నిర్ణయిస్తుంది.

సామాజిక జీవితంలో శ్రమ విభజనకు ఎంతో ప్రాముఖ్యం వుంది. వర్తక వాణిజ్యాలూ పరిశ్రమలూ పెరిగేకొద్దీ శ్రమవిభజన తీవ్రతరం అవుతుంది. కొందరు వ్యక్తులు భౌతిక వస్తువుల వుత్పత్తి నుంచి తప్పుకుని, భావ వస్తువుల వుత్పత్తికి పూనుకుంటారు. ఇందుమూలంగా "శుద్ధ సిద్ధాంతం" వుత్పన్నం కాగలదు. అంతే, భౌతిక ప్రమేయాలేవీ దీనికి పట్టవు. తత్వం, దైవశాస్త్రం (Theology) ఇలాంటివి. కళా

సాహిత్యాలు సైతం యిలాంటివే. లాభతృష్ణతో నడిచే పెట్టుబడిదారీ మార్కెట్ తాలూకు ఆర్థిక విషయాల ప్రాబల్యం వల్ల, సాహిత్యం క్రమక్రమంగా 'పారిశ్రామికీకరణ' పొందుతుంది. రచన అనేది కూడా ఒక ప్రత్యేక వృత్తి అవుతుంది.

తొలిదశలో మార్క్సు ఎంగెల్సులు చేసిన ఇలాంటి సూత్రీకరణలూ వ్యాఖ్యానాలూ కళాసాహిత్యాలను ఆర్థిక విషయాలకు అధీనం చేశాయి. ఆర్థిక శక్తుల ప్రభావం సమాజంలోగల భావాలమీద బలంగా వుంటుందని, యీ భావాల సంలీనం మూలంగా భావజాలం (ఐడియాలజీ) రూపొందుతుందని, యీ భావజాలం ఒక సామాజికవర్గం యొక్క వాస్తవ చైతన్యానికి గాక, 'కుహనా' (ఫాల్స్) చైతన్యానికీ ప్రతిబింబమని అన్నారు. భావజాలం దృష్ట్యా కళకు స్వయం ప్రతిపత్తి లేదన్నారు.

అయితే, 'ఇంట్రొడక్షన్ టు ద క్రిటిక్ ఆఫ్ పొలిటికల్ ఇకానమీ'కి రాసిన ముందు మాటలో (1857) సాహిత్యం గురించి మార్క్స్ మరికొన్ని వ్యాఖ్యలు చేశాడు. ప్రాచీన గ్రీస్‌దేశపు భౌతిక సంస్కృతి బాగా వెనుకబడి వుండినప్పటికీ దాని కళ చాలా పురోగమించి వుండింది కదా, యిది వైరుధ్య మనిపిస్తూవుంది. కళ అత్యున్నతమైన అభివృద్ధిని పొందిన కొన్ని కాలాలకూ సాధారణ సమాజాభివృద్ధికీ నేరుగా వైరుధ్యం యేదీ లేదు. గ్రీక్ కళకు మూలం దాని ఐతిహ్యాలు (మిత్). అంటే, దాని భౌతిక పునాదులు మత సంబంధమైన వుపరితల నిర్మాణంలో కనిపిస్తున్నాయిగాని ఆర్థిక మూల నిర్మాణంలో కాదు. హోమర్, ఈష్కిలస్ వంటి కళాకారుల ఆకర్షణ కాలాన్నే జయించింది గదా, మరి దీనికి కారణమేమిటంటే, గ్రీక్ నాగరికత మానవజాతి 'సహజ శైశవదశ'కు సంబంధించింది కావడంవల్ల అమాయకత, జీవశక్తి, స్వచ్ఛందత ఎప్పటికీ ఒకేవిధమైన ఆకర్షణను కలిగివుండడమేనని మార్క్సు రాశాడు. ఇలా, ఆర్థిక నిర్మాణం మీదగాక, మనస్తత్వం మీదనే ఎక్కువగా నొక్కిచెప్పడం జరిగింది. అయితే, మరి రెండేళ్ల తర్వాత, 1859 లో, అదే పుస్తకానికి రాసిన ఉపోద్ఘాతంలో మార్క్సు మళ్లీ ఆర్థిక విషయాలకుగల నిర్ణయాత్మక శక్తిని పునరుద్ఘాటించాడు. మానవుల వుత్పత్తి విధానమే మొత్తంమీద సామాజిక, రాజకీయ, మనస్సంబంధమైన జీవన క్రమాన్ని నిర్ణయిస్తుందని, పునాదిని ఆశ్రయించుకునే వుపరితల నిర్మాణం వుంటుందని చెప్పాడు.

అయితే యీ విషయంలో మార్క్సు పిడివాది కాదు. కళా సాహిత్య విషయాలు పూర్తిగా ఆర్థిక విషయాలకు ప్రతిబింబాలేనని మొండికిపడలేదు. షేక్స్పియర్, బాల్జాక్ వంటి వారిని గొప్ప కళాకారులుగా భావించాడు గాని, వట్టి ఆర్థిక ప్రయోజనాల ప్రతినిధులుగానే భావించలేదు. అయితే, ఎంగెల్సు మాత్రం అనేక సందర్భాలలో సాహిత్యం

సామాజిక జీవన క్రమాల ప్రతిబింబం మాత్రమే నన్నట్లు సూత్రీకరించాడు. కాని ఎంగెల్సు కూడ కళా విషయాలకు గల స్వయం ప్రతిపత్తిని పూర్తిగా నిరాకరించలేదు. "లుడ్విగ్ ఫ్యూర్ బాహ్" లో (1877) తత్వం, దైవశాస్త్రం వగైరాలు "ఉన్నత భావజాలాలు"గా పేర్కొన్నాడు. ఇలాంటి వాటిలో భావాలకూ వాటి భౌతిక మూలాలకూ గల సంబంధాలు చాలా జటిలంగా వుంటాయని, వీటిమధ్య గల లంకెలు ఆ సంబంధాలను మరుగుచేస్తాయని రాశాడు. రాజనీతిశాస్త్రం, అర్థశాస్త్రం వంటి వాటి వస్తువును శుద్ధమైన భావజాలరీత్యా నేరుగా చెప్పవచ్చుగాని కళ, సాహిత్యం, తత్వంవంటి వాటి వస్తువు మరింత సంకీర్ణంగా వుంటుందని రాశాడు. కళాసాహిత్యాది విషయాలరూపాన్ని వస్తువునీ సామాజిక విషయాలు ప్రభావితమే చెయ్యవనికాదు. రాజనీతిశాస్త్రం, అర్థశాస్త్రంవంటి వాటికంటే స్వతంత్రమైనవని మాత్రమే. కళాసాహిత్యాది విషయాలకూ సమాజానికీ మధ్యగల సంబంధాలు మరింత గూఢంగానూ, ప్రచ్ఛన్నంగానూ వున్నందుచేత, వీటివస్తువు అంతగా భావజాలానికి లోబడివున్నట్టు అనిపించదు. 'ది వోల్డ్ అండ్ దిన్యూ' అనే నవలగురించీ, 'ఎ సిటీ గర్ల్' అనే నవలగురించీ ఎంగెల్సు చేసిన వ్యాఖ్యలను గమనిస్తే రచయితకుగల రాజకీయాభిమానం రచనలో అంతర్లీనంగా వుండాలి గాని ప్రకటంగా వుండగూడదని, రాజకీయ భావజాలం కళాకారుడికి ప్రధానమైన ప్రమేయంకాదని, రచయితభావాలు గుప్తంగా వుంటేనే రచనకులాభమని ఎంగెల్సు భావించినట్లు తెలుస్తున్నది. ఒకరచన అందించ దలచుకున్న సందేశం అందులోని కథా పరిస్థితినీ చర్యనీబట్టి వెలువడినప్పుడే సహజ మనిపిస్తుందని ఎంగెల్సు రాశాడు. రచయిత తానుచిత్రించే సాంఘికఘర్షణకు ముందు ముందు యేర్పడగల చారిత్రక ఫలితాన్ని యిప్పుడే స్వయంగా చూపవలసిన అగత్యంలేదు. వాస్తవమానవ సంబంధాలను నిజాయితీగా చిత్రిస్తేచాలు. వాటి విషయంలోవున్న భ్రమలను పోగొడితే చాలు. తానే ఒక నిశ్చితమైన పరిష్కారాన్ని చూప నక్కరలేదు, ఏదో ఒక పక్షాన్ని వెనకేసుకు రానక్కర్లేదు. బాల్జాక్ మతరీత్యా కేథలిక్, రాజకీయ రీత్యా అభివృద్ధి నిరోధకుడు అయినా, కళాధర్మం రీత్యా, తన రాజకీయ ప్రయోజనాలనూ వర్గ పక్షపాత వైఖరులనూ తానే విడనాడక తప్పలేదు. తన అభిమానపాత్రులైన సంపన్న భూస్వాములు ఒకవర్గంగా అంతరించక తప్పదనే విషయం తనకు తెలుసు. అందుచేత, తనకు తెలిసి తెలిసిగానీ, తెలియకుండానే గాని. రచయిత తానభిమానించే భావజాలాన్ని సైతం తన రచనలలో కిందుజేసే అవకాశం వుంది. ఇక్కడ ఎంగెల్సు చేసిన వుపదేశం, బాహటంగా రచయితలు సామాజిక, రాజకీయాల విషయాలపై రచనలలో పాక్షిక వైఖరిని (టెండెన్సీ) ప్రదర్శించడం ద్వారా ఆ రచనల కళాధర్మాలను దెబ్బతీయరాదని మాత్రమే.

వాస్తవవాది అయిన నవలా రచయిత 'మచ్చుతునక'ల (టైప్స్) వంటి పాత్ర లను సృష్టించాలని ఎంగెల్సు అన్నాడు. వాస్తవవాదం అంటే, వర్ణించే విషయాల యథార్థత మాత్రమే గాక, మచ్చుతునకల్లాంటి పరిస్థితుల్లో మచ్చుతునకల్లాంటి పాత్రల యదార్థ సృష్టి అన్నాడు. అంటే, ఒక పాత్రకు ప్రాతినిధ్య స్వభావం వుండాలని అర్థం. వాస్తవ వ్యక్తుల్లో యీ పాత్రను పోలినవాడు ఒకే ఒక్కడై వుండక, అనేకులై వుంటారు. అలాంటి వారందరి గుణాలనూ లక్షణాలనూ యీ పాత్ర మూర్తీభవిస్తుంది. దీనికీ సామాజిక స్వభావం వుంటుంది. అంటే, సామాజిక వాస్తవం, యీ పాత్రలో రూపుదాలుస్తుందని అర్థం. పునాదిని వుపరి తల నిర్మాణంపూర్తిగా ప్రతిబింబించడమే అవు తుంది. ఎంగెల్సు తన చివరి రోజుల్లో యీమొండివైఖరిని కొంత సవరించుకున్నాడు. చారిత్రక విషయాల నన్నిటినీ ఈవరకే తయారైన ఒకానొక మూసలోపోసే పద్ధతిని అనుసరిస్తే భౌతికవాదపద్ధతే దెబ్బతింటుందని హెచ్చరించాడు. ఆర్థిక విషయాలకు అంతి మంగా నిర్ణాయక శక్తి వుంటుంది, అది కూడా దీర్ఘకాలికంగా మాత్రమే గాని, భౌతిక విషయాలలో భావజాల విషయాలలో పరస్పర ప్రభావం ఎంతగానో వుంటుందని ఎంగెల్సు వివరించాడు. ఆర్థిక శక్తులు తాత్విక సంప్రదాయాన్ని ప్రభావితం చెయ్య వచ్చుగాని, నేరుగా అత్యధిక ప్రభావాన్ని ప్రసరింపజేసేవి ఆర్థికశక్తులకంటె హెచ్చుగా రాజకీయ, నైతిక రూపాలే నన్నాడు. తత్వశాస్త్రంమీద ఎట్లాగో సాహిత్యంమీదకూడా అట్లాగే ఆర్థిక విషయాల ప్రభావం నేరుగా వుండవలసిన పనిలేదు. రాజకీయ, మత, సాహిత్య అభివృద్ధి, ఆర్థిక విషయాలమీద ఆధారపడి వున్నా, ఈ ఒక్కటే వాటన్నిటినీ శాసించడం బదులు, ఆర్థిక ఆవశ్యకతమీద ఆధారపడిన పరస్పర చర్యా ప్రతిచర్యలు వుంటాయని, అంతిమంగా యీ ఆర్థిక ఆవశ్యకత బయల్పడుతుందని ఎంగెల్సు అన్నాడు. ఆర్థిక రంగం నుంచి ఒకానొక రంగం ఎంత యెక్కువ దూరాన వున్నదో, నిరూప (abstract) భావజాలానికి ఎంత యెక్కువ దాపున వున్నదో, దాన్నిబట్టి, ఆర్థిక విషయాల నుండి మొదలై సరళ రేఖలా సాగకుండా, ఎన్నో చిక్కిరి బిక్కిరి మెలికలతో వక్రరేఖలా అది సాగుతుంది. అయితే యీ వక్రరేఖ అంతిమంగా, దీర్ఘకాలానికి, సమాజం తాలూకు ఆర్థిక నిర్మితినే అనుసరిస్తుంది.

ప్లెహనోవ్ కళాసాహిత్యాలకు గల సామాజిక పునాదుల విషయంలో మరీ మొర టుగా రాశాడు. అయితే ఇమ్మాన్యువల్ కాంట్ ప్రభావం కూడా అతనిమీద వుంది. కళకుగల సామాజిక కర్తవ్యం గురించి మార్క్సును అనుసరించాడు: "మానవుడు తన చుట్టూవున్న వాస్తవం తాలూకు ప్రభావానికి లోనైనప్పుడు పొందే అనుభూతులనూ

భావాలనూ తనలో తాను గుర్తుచేసుకుని, వాటిని అలంకారాత్మకంగా ప్రకటించడంతో కళ మొదలౌతుంది". కళా సాహిత్యాలు ఉత్పత్తి సాధనాలకూ ఆస్తి సంబంధాలకూ అధీనమై వుంటాయి. అయినా మనిషికి సహజంగానే సౌందర్య భావం వుంది. మంచి దేదో మంచిది కానిదేదో అతడు నిర్ణయించుకో గలడు. అలానే, సామాజిక కర్తవ్యాన్ని నెరవేరిస్తేనే చాలదన్నమాట. సౌందర్య దృష్టి మూలంగా మనిషి గొప్ప కళను ఆనం దించగలడని ప్లెహనోవ్ అంటాడు. ఇక్కడే ప్లెహనోవ్ కళా సిద్ధాంతంమీద కాంట్ ప్రభావం స్పష్టం. సమాజందృష్ట్యా ప్రాముఖ్యం కలిగిన చర్యలనూ భావోద్రేకాలనూ, ఘటనలనూ చిత్రించినప్పుడే కళకు సార్థకత వుంటుందనీ, కళ ప్రధానంగా సామాజిక జీవిత ప్రతిబింబమేననీ పదేపదే చెబుతూ వచ్చినా. యీ సౌందర్యభావం సామాజికే తరం, వర్గాతీతం అయినందుచేత, ఆ సిద్ధాంతానికీ యీ మినహాయింపుకీ పొంతన లేకుండా పోయింది. ప్లెహనోవ్ దృష్టిలో, సాంస్కృతిక చరిత్ర సమాజంలోని వర్గాల చరిత్రకూ వాటి పరస్పర పోరాటాల చరిత్రకూ, ప్రతిబింబమే. ఈ వస్తువుకి అది నీడ. వర్గ పోరాటం దృష్ట్యానే ఆధునిక కళా సాహిత్యాల సారాన్ని గ్రహించవచ్చు నంటాడు ప్లెహనోవ్. తన సామాజిక పారిసర్యంతో స్పర్థించి పరాయితనాన్ని పొం దిన కళాకారుడే, 'కళకోసం కళ' అనే దృక్పథాన్ని అవలంబించగలడు. ఫ్లాబర్ట్, గోన్‌కోర్ట్ సోదరులవంటి ఫ్రెంచి నవలాకారులు తెలిసితెలిసీ బూర్జువా సమాజాన్ని తోసివేశారు- నిస్పృహా పాలయ్యారు. కాబట్టే కళకూ కళాకారుడికీ స్వయంప్రతిపత్తి వుండాలనీ, వుందనీ వాదించారు, స్వార్థపూరితమైన, సంకుచితమైన, ఆత్మసంతృ ప్తితోకూడిన మధ్యతరగతి అల్పమనస్కతను నిరసించి కూడా, యీ రచయితలు శ్రామిక వర్గంతో మమేకం కాలేకపోయారు. వర్తమాన కాలాన్ని నిరాకరించారు గాని భవి ష్యత్కాలాన్ని అభిమానించలేకపోయారు. ప్లెహనోవ్, ఎమిలీ జోలాలాంటి నవలాకారు లను విమర్శిస్తూ, వాళ్లు మధ్యతరగతిని గర్హిస్తున్నట్లే అనిపిస్తారుగాని నిజానికి బూర్జువా సమాజాన్ని బలపరుస్తున్నారని అన్నాడు. జోలా 'సహజవాదం' (Naturalism) వ్యక్తుల కోరికలకూ చేష్టలకూ అలవాట్లకూ గల సాంఘిక మూలాలను చూపెట్టక, వ్యక్తి శారీరక, మానసిక లోపాలనే కారణాలుగా చూపెట్టింది. మనుషుల్ని ఒక గొప్ప సామాజిక సంఘటనలోని సభ్యులుగా గాక, వట్టి వ్యక్తి మాత్రులుగా చిత్రించింది. బూర్జువా సమాజాన్ని విమర్శించి వుండవచ్చుగాని ఈ 'సహజవాదం' దాన్ని ఖండించి నిరాకరించలేదని ప్లెహనోవ్ విమర్శ. 1848 తర్వాతి బూర్జువా దశలో గొప్ప సాహి త్యమే రాలేదని, రచయితలు మానసికంగా భవిష్యత్తునీ, సోషలిజాన్నీ సమర్థించేంత వరకు గొప్ప సాహిత్యం వెలువడబోదని ఆయన వాదం. దీన్ని జార్జి లూకాజ్ కూడా

అంగీకరించాడు. ఆధునిక సాహిత్యం క్షీణతకు ఆలవాలమై నిస్పృహలో కూరుకు పోతోందని లూకాజ్ కూడా రాశాడు.

బూర్జువా వాస్తవవాదం 'విమర్శాత్మక వాస్తవవాదం' పందొమ్మిదో శతాబ్ది ద్వితీయార్థంలో గొప్ప రచనలను సృష్టించిందని లూకాజ్ అంగీకరిస్తాడు. సోషలిస్టు దర్శనం లేకుండా 1848 తర్వాత గొప్ప నవలలు రాయడం అసంభవం అని లూకాజ్ అభిప్రాయం. బూర్జువావర్గంతో సమరస భావం గల రచయితలు చరిత్రలో ఆవర్గం యొక్క క్షీణతను తమ రచనలలో ప్రతిబింబించక తప్పదు. సాహిత్యం ఒక వర్గ దృక్పథం నుంచి, ఒక లోక దర్శనంతో రాసేది. దానికొక ముందుచూపు వుండి తీరుతుంది (పర్స్పెక్టివ్). ఆధునిక సాహిత్యానికి యిలాంటి ముందుచూపేది లేదు. ఇది 'నిష్పాక్షికం' అన్నట్టు నటిస్తుంది, వస్తుపరమైన దృక్పథమనిపిస్తుంది. ముందు చూపనేది లేకుంటే వాస్తవంలో ముఖ్యాంశమేదో, కానిదేదో విడమర్చడం సాధ్యం కాదు. అప్పుడు అల్ప అనల్ప విషయాలన్నిటినీ నిర్విచక్షణగా యేకరువు పెట్టడమే మిగులుతుంది. అలాంటి రచనలు స్థాణువులౌతాయిగాని కదిలి కదిలించలేవు. వాటికి సోషలిస్టు మానవత పట్టుబడదు. వట్టి స్వీయాత్మకదృష్టి పెరిగి, మనస్సుకు వచ్చిన అనుభవాన్నల్లా వాస్తవమనుకొని, మనిషిని ఒంటరిగాడుగా, ఆత్మదూరుడుగా, మనో వ్యాధిగ్రస్తుడుగా, సామాజిక జగత్తుతో సార్థకమైన సంబంధమేదీ లేనివాడుగా చూపడం జరుగుతుంది. ప్రౌస్ట్, ముసిల్, జాయిస్, శామ్యుయేల్ బెకెట్ లాంటి రచయితలు చెయ్యగలిగింది ఇంతేనంటాడు లూకాజ్. మనిషికిగల సమగ్రత స్థానే, పాక్షికత, శకలప్రాయత చిత్రితమౌతాయి. అనంతంగా పెరిగిపోయిన సామాజిక శ్రమవిభజన మూలాన, మానవత్వాన్ని వికృతంచేసే అమానుష దుష్ఫలితాలను రద్దు చెయ్యాలంటే, సోషలిజం కోసం సాగే పోరాటంలో పాల్గొనాలి తప్ప సాహిత్యం సాంస్కృతికంగా జడపదార్థం కాగూడదు. సోషలిజంద్వారానే మానవుడికి మళ్లీ సర్వసమగ్రత చేకూరు తుంది. సర్వతోముఖమైన, సుసమన్వితమైన, స్వతంత్రమైన వ్యక్తిత్వాన్ని మళ్లీ మానవుడు సాధించుకుంటాడు. ఈ ముందుచూపే సమకాలికులైన ఆధునిక రచయిత లకు లోపించింది. వాళ్లు వాస్తవాన్ని పాక్షికంగా మాత్రమే తమ రచనలో చిత్రిస్తు న్నారు. వికృతంగానూ చిత్రిస్తున్నారు. అందుచేత మచ్చుతునక లనదగిన పాత్రలు యీ ఆధునిక సాహిత్యంలో కరువయ్యాయి. 'కలకాలం నిలవగల మచ్చుతునకల వంటి మానవ పాత్రలను' సృష్టించ గలగడం మహా రచయితల లక్షణం. సాహిత్య శక్తికి యిదే కొలబద్ద. ఇలాంటి 'మచ్చుతునక'లో గత కాలాల సారభూతమైన పదార్థం నిక్షిప్తమౌతుంది. సర్వ సమగ్రతగల మచ్చుతునకలవంటి పాత్రలలో గతకాలానికి

చెందిన అత్యున్నతమైన మానవ విలువలు అమరత్వం చెందుతాయి. సమాజం ప్రవాహప్రాయంగా ముందుకు అభ్యుదయంవైపు సాగిపోయే సంబంధాల కూడిక అని రచయిత గ్రహించ గలిగినపుడు, ఈ చైతన్యం నుంచి మచ్చుతునకలలాంటి పాత్రలు పుట్టుకొస్తాయి. పెట్టుబడిదారీ సమాజానికి సంబంధించి మచ్చుతునకల లాంటి శాశ్వత మైన పాత్రలను బాల్జాక్ సృష్టించ గలిగాడంటే, సామాజికక్రమం మొత్తంగా పాత్రకు గల లక్షణాల మొత్తంలో సమసిస్తున్నందుచేతనే. బూర్జువావర్గం 1830ల తర్వాత అభ్యుదయాత్మకతకు దూరమై కొత్త పాలకవర్గమై కూర్చుని ఇతర వర్గాలను అణచి వెయ్యసాగిందనే వాస్తవాన్ని గుర్తించినందుచేత, బాల్జాక్‌లా స్టెండాల్ గొప్ప పాత్ర లను సృష్టించలేకపోయాడు. 1848 విప్లవాల తర్వాత రచయితలు మచ్చుతునకల్లాంటి పాత్రలను గాక, సగటు మనుషుల్లాంటి పాత్రలను సృష్టించబూనుకున్నారు. నవలకు ఒక కథావస్తువు లోపించింది. ఈ పాత్రలకు చేష్టలు లోపించాయి. వీటి బదులు సాంఘిక పారిసర్య వర్ణనే ఎక్కువైంది. రచయిత సమాజ జీవితంలో భాగస్వామిగాక ప్రేక్షకప్రాయుడయ్యాడు. ఘటనా పరంపరను నమోదు చెయ్యడమే అతని పనైంది. సాంఘిక జీవిత స్రవంతిలో మునిగి తేలనందుచేత దాని తాలూకు 'గాఢమైన' అనుభ వానికి రచయితలు దూరమయ్యారు. ఇలాంటి అనుభవం లోపించబట్టి, తాము చిత్రించే ప్రపంచాన్ని నిర్ణయిస్తున్న అతి ముఖ్యమైన సామాజిక విషయాలను కనుగోలేకపో యారు. గొప్ప నవలాకారులు శుష్క వచనప్రాయమైన సామాజిక జీవితంలో మునిగి తేలుతూ కూడా దాన్ని అతిక్రమించి పోగల కవితాత్మ కలిగినవారు. మనిషిని నవ సమాజ నిర్మాణంలో పోరాటకారుడుగా వర్ణించే సాహిత్యంలోనే సోషలిస్టు వాస్తవికతా వాదం వుంటుంది.

('సోషాలజీ అండ్ లిటరేచర్' ఆధారంగా)

---

## ఇంకా ఉదయించని రాత్రి

సురా

విష విషాద
చరణాలగీతం నిశ్శబ్దంగా
ఆలాపిస్తోంది.
వసంతమేఘం
చేరువై, సుదూరమై మట్టిలో
ధ్వనిస్తోంది

అయినా
ముక్కలయిన
ప్రతిధ్వనులని అల్లుకుంటూ
పోరాటం ముందుకే సాగుతుంది

అందుకే
నేస్తం

ఈ వేళ
నా కళ్ళల్లో
మిగిలిపోయిన కలలకి
నిదురాలేదు, నిరాశలేదు.

---

## మహా సంకల్పం!

అజ్ఞాత సూరీడు

నువ్వు పేల్చబోయిన తుపాకీలోని
బుల్లెట్లు మింగేశాను నేను-
నువ్వు కొట్టబోయిన లాఠీని
విరిచేశాను నేను-
నామీద చెయ్యబోయిన ప్రచారాన్ని
త్రిప్పి నీముఖాన్నే కొట్టాను నేను-
నాకోసంనువ్వు తీసివుంచిన
గోతిప్రక్కనే పొంచి కూర్చున్నానిప్పుడు
నీ మృతదేహంమీద మట్టి కప్పటాన్కి-
మహాసంకల్పం :

---

## ప్రజావాహినీ! కదలిరా!

సి. రామచంద్రారెడ్డి

బిర్సాంపూర్, బైలదిల్లా
సంత్‌నగర్, పాట్నా
భాగ్యనగర్, దిండిగల్
ఏదైతేనేం
ఒక్కొక్కటి
ప్రజలపాలిట ఓ బలివితర్ది
రిజర్వేషన్‌లు, కూలిసమస్యలు
మానభంగాలు, రైతుసమస్యలు
ఏవైతేనేం
ఒక్కొక్కటి
ప్రజాహృదయాల్లో రగుల్తోన్న
ఓ నిప్పురవ్వ
సంత్‌నగర్‌లో రైతుకూలీ
గోదావరిఖనిలో కార్మికుడు
దిండిగల్‌లో రైతన్న
పూరించిన విప్లవ శంఖారావం
పీడితులగుండెల్లో ప్రతిధ్వనిస్తుంది
"ఉధృతవాహినికి వారధి కట్టవచ్చు
కాని, ప్రజావాహినికి వారధిలేదు జగాన"

## దొర కూలోడు!

బొల్లిముంత నాగేశ్వరరావు

కారెక్కి పోయేడు బూవులదొర
కోడికూరతిన్నాడు బూవులదొర
ఎండెక్కి పోయేడు దొరకూలోడు
ఇంటికెళ్ళి కూకుంటె దొరకూలోడు
పంటిక్రింద మెతుకులేదు దొరకూలోన్ని
కోపమొచ్చి అరచేడు దొరకూలోడు
కళ్ళెర్రజేసిండు దొరకూలోడు

బూవుల్లోకి పోయేడు దొరకూలోడు
బువ్వగింజలు తెచ్చేడు దొరకూలోడు
బూదేవి నాదన్నాడు దొరకూలోడు
బూవులదొర కారేసుకు బుర్రుసవత్తే
చిర్రెత్తి కర్రెత్తె, దొరకూలోడు।

---

## కాంట్రాక్టరు!

ఎ. అప్పల్నాయుడు

సెమటయినా కార్చనోడు
కాలయినా కదపనోడు
కారూ....మేడలు కలిగినోడురా
ఆడుకంపెనీ కాంట్రాటరుగాడురా ॥సెమ॥

ఆడు ఎండలో ఏనాడూవుండడు
ఆడు వానలో ఏనాడూ నానడు
ఆడు సల్లగాలి సాయంకాల వేలలో
ఆడు కారెక్కి జోరుజోరు గొచ్చిరా
ఆడు ధూలికిదూరంగ ఆగుతాడురా

ధూలిలోన దుమ్ములోన
ఎముకలిరుగ పనిజేస్తే
యేదీ మీపని అని
కేకలేసి తిడతాడు ॥సెమ॥

ఆడు పూటకూలి బత్తెమిచ్చినాడురా
ఆడు సెమటా రత్తాము దోచినాడురా
ఆడు కొండమీది రాయిగొట్టడానికి
ఆడు కండ కండ పిండించినాడురా
ఆడు రిజర్వాయరు కట్టించడానికీ
ఆడు రాయి రాయి మోయించినాడురా

సత్తువల్ల సాగదీసి
ఎండల్లో పాటుపడితె
ఒళ్లుకొవ్వెక్కి మీరు
రాలు మొయ్యలేదంటాడు॥ సెమ॥

ఆడు చాలీచాలని కూలిచ్చినాడురా
ఆడు కాలువాలు దవ్వించినాడురా
ఆడు లారీల మట్టిపనికి పిలిచిరా
ఆడు రోజంతా కష్టబెట్టినాడురా
ఆడు రోడ్డు పోయించినాడురా

రోజు కూలిరేటు
చాలదు మాకంటె
బజారులో సీరేటు
యింతేనని బొమ్మంటడు ॥సెమ॥

ఆడు మనసెమట దోచుకున్నాడురా
ఆడు బేంకులోన దాచుకున్నాడురా
ఆడు మనకండబలంతో గానిరా
ఆడు బంగళాలు భవనాలు గట్టెరా
ఆడు మన రత్తం ధారాలతోటిరా
ఆడు రంగు రంగు కారులెక్కుతాడురా

కష్టపడే మనకెందుకు
కరువు....బరువు బాధలూ
కారు....మేడ....సంపదల్లో
భాగముంది....కదలరా ॥సెమ॥

("సంచయినా లేనోడు" పాటమాదిరి)

# అలీన భుజంగాలు

టంకశాల అశోక్

పిల్లి చాంద్రాయణ వ్రతం ఆచరించినట్లు
కొంగ జపం చేసినట్లు
భుజంగాలు అలీన విధానాన్ని అనుసరిస్తుంటాయి

నిజంగా అలీన విధానమంత సుఖం మరొకటిలేదు
కుందేళ్లతో పరుగెత్తవచ్చు
కుక్కలతో కలిసి వేటాడవచ్చు
ఎటుప్రక్క ఇరకాటం వచ్చినా మళ్లీ
ఉన్నచోటే నిలుచుని అలీన జపమాల తిప్పవచ్చు

దేశంలో ప్రజల్ని దోపిడీదార్లకు బలిపెట్టే ఏజెంటువైనా
"ప్రపంచ నూతన ఆర్థిక వ్యవస్థ" అంటూ ప్యారిస్‌లో అరిస్తేచాలు
హరిజనుణ్ని చంపేందుకు బిహారీ భూస్వామికి తుపాకులిచ్చినా*
ఐక్యరాజ్య సమితిలో "నో అపార్థీడ్" అని బల్లగుద్దితే చాలు
తూర్పున, ఉత్తరాన రాకాసి బాహువులు చాచినా
అరబ్బులపై ఇజ్రైలీ దురాక్రమణను, అమెరికా సామ్రాజ్యవాదాన్ని
ఖండిస్తే చాలు

ఐనా- అలీనత అనేది విదేశాంగ విధానమని నువ్వు టెక్నికల్
అభ్యంతరం ఒకటి చెప్పవచ్చు
కాని- నేను చెప్పేది
నువ్వు
బయట ఏమైనా, కాకపోయినా
ఇంటమాత్రం
పిల్లివే, కొంగవే, జనాన్ని వేటాడే కుక్కవే?



*ధాన్యం లెవీ చెల్లించిన భూస్వాములకు బోనస్‌గా బీహార్ సర్కారు తుపాకు లిచ్చింది. తమ దగ్గరున్న కొన్ని లక్షల లీగల్, ఇల్లీగల్ తుపాకులతో వాళ్లేం చేస్తున్నారో ప్రభుత్వానికి మాత్రమే తెలియదు.

# సిన్నమ్మ వొచ్చింది

మనం వుండే ఈ ధనిక సమాజానికి ఒక వ్యవస్థ వుందనికాని, ఆ వ్యవస్థవల్ల సమాజంలో అన్యాయం నిర్ణీతంగా జరుగుతూంటుందని కాని, తెలియ జెప్పకుండా, "మనిషిని మారిస్తే సమాజం దానంతట అదే మారుతుంది" అనే వాదం తరతరాలుగా చాలామంది చేస్తున్నారు. ఈ సమాజానికివున్న వ్యవస్థ కంటికి కనిపించదు. అలా కని పించకపోవడం ఈ వ్యవస్థ లక్షణాలలో ఒకటి. "కంటికి కనిపించేదే నిజమైతే శాస్త్ర విజ్ఞానం అనవసరమై వుండేది" అన్నాడు మార్క్స్. వ్యక్తిగతమైన మంచితనంవల్ల డబ్బున్న వాళ్లలో కొందరు తమ ఆస్తిని పేదవాళ్లకి దానం చేసెయ్యవచ్చు. అలాగే పేదవాళ్లలో కొందరు నాలుగురాళ్లు చేసుకుని ధనవంతులు కానూవచ్చు. కాని ఇలాం టివి ఎన్ని జరిగినా, ఈ సమాజంలో చాలామంది పేదవాళ్లుండడం, కొంచెం మంది వాళ్లని దోచుకుతినే ధనవంతులుండడం- ఈ వ్యవస్థ వున్నన్నాళ్లూ వుంటుంది. అది పెట్టుబడిదారీ సమాజపు లక్షణం. ఈ సంగతి చెప్పినవాడు మార్క్స్.

టూకీగా చెప్పాలంటే ఆయన ఆర్థిక సిద్ధాంతం ఇది :

సంపద అంటే, మనుషుల జీవితావసరాలు తీర్చే వస్తువులు. వాటన్నిటికీ ఒక సమాన లక్షణం వుండబట్టే, వాటన్నిటికీ రూపాయిల్లో విలువకట్టడం సాధ్యమైంది. ఆ సమాన లక్షణం ఏమిటంటే : ఆ వస్తువులన్నీ కూలివాళ్ల శ్రమవల్లనే తయారు కావడం. ఆ వస్తువుల యజమాని అమ్ముకోగా, అతని కిట్టుబాటు ధరపోను మిగిలే లాభంలోంచే పెట్టుబడి ఏర్పడుతోంది. ఇది నిజానికి కూలివాళ్లు సృష్టించినది; యజ మాని దీనిని సొంత ఆస్తిగా చేసుకుంటున్నాడు. ఈ పెట్టుబడి యజమానుల సొంత ఆస్తిగా వున్నంతకాలమూ యజమానీ కూలివాడూ అనే రూపంలో మానవ బాంధవ్యాలు ఉండక తప్పవు; యజమాని కూలివాళ్లని దోచుకోవడమూ తప్పదు.

నిత్యజీవితంలో ఈసంగతి ఇంతస్ఫుటంగా కనిపించదు. యజమానులకి కోరలూ గోళ్లూ వుండవు. కూలివాళ్ళ ఆస్తుల్ని వాళ్ళు దోచుకుతింటునట్టు కనిపించనూ కనిపించదు. పైగా చాలామంది డబ్బున్నవాళ్లకి ఎంతో "ధర్మదృష్టి" వుండడం చూస్తుంటాము కూడా. బిర్లాఎన్ని దేవాలయాలు కట్టించలేదు! స్మగ్లర్లుఎన్ని దానధర్మాలు చెయ్యలేదు! ఈ "మంచితనాన్ని" చూసి ఇలా అందరూ 'మంచి' వాళ్లయిపోతేచాలు- సమాజంలో అన్యాయం వుండదని అనుకోవడం తేలిక. అలా అనుకునే అమాయకులు చాలామంది వుండగా అలా చాలామంది అనుకోవడం తమకు మంచిదని గ్రహించినవాళ్లు అలాటి

"ధర్మాన్నీ" "మంచితనాన్నీ" యథాశక్తి ప్రచారం చేయిస్తుంటారు. ఇలాటివాళ్లలో మతప్రవక్తలున్నారు, రాజకీయ నాయకులున్నారు, మేధావులున్నారు, రచయితలున్నారు. వీళ్లందరికీ ఒక సామాన్యలక్షణం వుంది; వీళ్లంతా ఈ ప్రస్తుత వ్యవస్థవల్ల లాభం పొందుతున్నవాళ్ళు. ఇది మారవలసిన అవసరం వీళ్ళకిలేదు. పోతే నష్టంవుంది.

కాగా ఈ వ్యవస్థకి నిజమైన ప్రమాదం విప్లవం రూపంలో వుండబోతుందని వీళ్ళకిమరి నిక్కచ్చిగా తెలిసివొస్తోంది. అందుచేత అహింసకి లోకోత్తరమైన ప్రాముఖ్యంఇచ్చి, దేశకాల సందర్భాలతో నిమిత్తం లేకుండా హింసని దుష్టగుణంగానూ, అహింసని మంచిగుణంగానూ చిత్రిస్తారు వీళ్ళు. అహింస అనే మాటకున్న గౌరవాన్ని స్వార్థ ప్రయోజనాలకి వాడుకోవడం తేలికని వీళ్ళకితెలుసు. అది సాగకపోతే, ఎవరి కన్నానైనా ఎక్కువగా దారుణమైన హింస ప్రయోగించడానికి కావలసిన వసతులు ఈ వర్గంచేతులో ఎలాగా వున్నాయి.

రంధి సోమరాజు రాసిన "సిన్నమ్మ వొచ్చింది" తాత్వికంగా ఈ ప్రయత్నంలో ఒక చిన్న భాగం.

అనగా అనగా అమరావతి అని ఒక అమ్మాయి. అంతకు ముందు ఓ పేద గూడెం. ఓ వూరు. అందులో బోలెడు మంది ఉన్నవాళ్లు, కమ్మవాళ్లు, నాయుళ్లు, వాళ్ల మధ్య రకరకాల కక్షలు. ఒక కాలేజీ. అందులో అమ్మాయిలు అబ్బాయిలు. అమరావతికి ప్రజల్ని ఉద్ధరించాలని కోరిక. అందుకని ఓ డబ్బున్న హిప్పీ అబ్బాయిని కాదని, ఓ రిక్షావాణ్ణి చేసుకుందామని అనుకుని, అదీమానేసి, ఓరోజున తిన్నగా ఆ గూడెంలోకి వెళ్ళిపోతుంది– తన చెలికత్తెల్తో. అంతే–ఆగూడెంలో పేదరికం పటాపంచలైపోతుంది, జనంలో ఐకమత్యం కలిగిపోతుంది, చివరికి బయట్నించి వచ్చినరౌడీలు పెట్టిననిప్పులో అమరావతి వొళ్లు కాలి చచ్చిపోతుంది. చచ్చిపోయేముందు ఆ దుర్మార్గుల్నికూడా ప్రేమించమని తనభక్తులకి చెప్పేసి మరీ చచ్చిపోతుంది. వాళ్లు అమరావతి గురించి పాటలుపాడుకుంటూ మంచివాళ్లైపోతారు– ఇదికథ.

లోకంలో సమస్యలన్నింటికీ మూలం మానవులు ఒకళ్ల నొకళ్లు ప్రేమించుకోలేక పోవడమే. అందుచేత, మహాజనులారా! వెంటనే ఒకళ్లనొకళ్లు ప్రేమించేసుకుంటూ ఉండండి. అన్యాయాలుండవు. అధికధరలుండవు. అధికారుల అక్రమాలు, ప్రభుత్వాల దౌర్జన్యాలూ వుండవు– ఇది సందేశం.

సోమరాజు పుస్తకంలోని కథనీ, సందేశాన్నీ ఇలా తిరిగి చెప్పడంలో సమీక్షకుడి ఉద్దేశ్యం: ఇది రచనగా పొందిన వైఫల్యాన్ని ప్రదర్శించడం. రచయితకి వున్న

సంకల్పం, తాత్త్వికంగా ఎలాంటిదైనా, అది నెరవేరలేదు. అందుకు కారణం క్లుప్తంగా చెప్పాలంటే- ఆయనకి కవిగా కాని, కథకుడుగా కాని, సంకల్పానికి తుల్యమైన సామర్థ్యం లేదు.

ఇది వచన పద్యరూపంలో రాసిన కథ. తెలుగులో వచన పద్యం రాస్తున్న చాలా మందికి లాగానే సోమరాజుకి కూడా వచన పద్యం పట్టుబడలేదు. వచనాన్ని అక్షడక్షడ కత్తిరించి నిలువుగా అచ్చువేస్తే వచన పద్యం అయిపోతుందనే భ్రిమ- చాలామందికి లాగా- ఈయనకీ వుంది. ఈ భ్రిమకి తోడు ఒకే మూసలో వున్న వాక్యాలు దొంతులు దొంతులుగా పేర్చి రూళ్లకర్రి పద్యం రాయడం ఈయన రచనలోని ఒకేఒక టెక్నిక్. ఉదాహరణకి:

అంటూ తండ్రి చెప్తూన్న
ఆ మాటలు విన్న అమరావతి
నాన్నా నాన్నా
అంటూ ఉప్పొంగి పోయింది. (పుట 25)

అన్న భాగాన్ని "అంటూ తండ్రి చెప్తూన్న ఆ మాటలు విన్న అమరావతి నాన్నా నాన్నా అంటూ ఉప్పొంగిపోయింది" అని అచ్చువేసే కన్న పైవిధంగా ముక్కలుచేసి అచ్చెయ్యడం వల్ల ఏం కలిసొచ్చిందో తెలియదు. ఏరకంగా చూసినా ఇది వచనమే. అచ్చువేసే తీరువల్ల మాత్రిమే పద్యత్వాన్ని ఆశించేది ఈ పుస్తకంలో రచన.

ఆయితే, అచ్చువేసేతీరు వచన పద్యంలో పద్యత్వానికి అసలు ఉపయోగపడదా అంటే, ఉపయోగపడుతుంది. వచనపద్యం ప్రస్తుతః "చూసి చదువుకోవలసిన పద్యం" కావడంవల్ల, పంక్తిచివర విరుపులు ఆ రచనని పద్యంలా చదవవలసిన స్థితికి పాఠకుణ్ణి సంసిద్ధం చేస్తాయి. అలా విరిచి అచ్చువేసిన తీరుమీద వచన పద్యపంక్తి అస్తిత్వం కొంతవరకూనైనా ఆధారపడివుంది. ఈపంక్తి ఇక్కడే ఎందుకు విరవాలి, ఈరెండు పంక్తులూ కలిపి ఎందుకు ఒకపంక్తిగా రాయకూడదు- ఇత్యాది శంకలకి ఛందోబద్ధ పద్యంలో వున్నలాంటి సమాధానాలు వుండవు. వచనపద్యంలో అచ్చు వేసేతీరు రచనలో ఒకభాగం.

కాని, అంతమాత్రాన, ఏవచనకావ్యమైనా కొన్నిచోట్ల ముక్కలుచేసి నిలువుగా అచ్చువేసినంత మాత్రాన, వచనపద్యం అయిపోదు. సోమరాజు పుస్తకంలోని వచన పద్యంస్థితి ఇలాంటిది. నిజానికి ఆయన చేసిన పూర్వరచనల్లో పరిస్థితికూడా ఇలాంటిదే.

అయితే ఈపుస్తకంలో, గూడెంలో ఆడవాళ్లు అమరావతిని ఊసడిస్తూ కట్టిన పాటలనిగురించి చెప్పేటప్పుడూ, అలాంటి మరో ఒకటి రెండు సందర్భాలలోనూ రచయిత వచనపద్యంమాని గేయరూపాన్ని అనుసరించారు. అందులో ఒకటి రెండుచోట్ల కూర్పు బాగుంది. పుస్తకం మొత్తంమీద ఫరవాలేదనేపాటి నేర్పు కనిపించేది ఈ అల్ప భాగంలోనే.

వచనపద్యంగా విఫలమైన సోమరాజు పుస్తకం వచనంగానైనా సరిగా నడవదు. రచయితకి తెలుగు భాషలోని ఒడుపులు సుతరామూ తెలియవు. కవిత్వం కావడానికి తగిన వూహవచ్చినాకూడా, దాన్ని మాటల్లో ఎలామలచాలో తెలియదీయనకి- ఉదాహరణకి:

"ఎండిపోతున్న ఈ ఎంగిలికంచం అశ్రద్ధల తొలగించు" అశ్రద్ధకి ఎండిపోతున్న ఎంగిలికంచం మంచి ఉపమానమే. కాని అదివాక్యంలో ఎలామలచాలో తెలియని రచయిత సాధించగలిగింది. నిర్మాణ సౌష్టవంలేని వాక్యంమాత్రమే.

చాలాచోట్ల రెండుమూడు చిత్రాలను ఒకేచోట కుక్కెయ్యాలని రచయిత ప్రయత్నిస్తాడు. ఉదాహణకి :

"అరిగిపోయిన మొండిచీపురు బతుకుల కన్నీరు" మొండిచీపుర్ని బతుక్కి రూపకం చెయ్యడం సమర్థమైనదే. కాని, ఆ బతుక్కి కన్నీరుని కల్పించడం పూర్వచిత్రానికి సహకారికాదు. ఇలా ఒకదానికొకటి పొందని వూహల్ని ఒకవాక్యంలో కుక్కెయ్యడం వల్ల వాక్యం ఉక్కిరిబిక్కిరై పోతుంది.

ఇలాంటి అసమర్థ నిర్మాణాల ఫలితంగా- కవిత్వంమాట దేవుడెరుగునుగాని అన్వయ సౌలభ్యంలేని కుంటుడు వాక్యాలు పుస్తకంనిండా మిగిలాయి.

ఇకపోతే, చెప్పుటేకాని, కాపాడుదును ఉద్వాహమాడుట లాంటి పాత తెలుగు మాటల్ని మాట్లాడే తెలుగులో కలిపెయ్యడం పిరింబెడా వేశాలు, పెయింబెడ నృత్యాలు వంటి ఇంగ్లీషు తెలుగు కలగాయ సమాసాలు వాడడం- ఇవి రచయితలో పసితనపు పదవ్యామోహాన్ని ప్రదర్శిస్తున్నాయి.

వచన కవిత్వంగానూ, వచనంగానూ ఇది విఫలమైనా, పోనీ కథగానైనా నిలుస్తుందా అని చూస్తే- అదీ కన్పించదు. ఇందులో వాస్తవికత లోపించడం ఒక్కటే ఇందులో లోపం కాదు. కథకి కావలసిన ప్రాథమికమైన కట్టడపు తీరు దీనికి లేదు. వాస్తవికత, కాల్పనికత ఇలాంటి పదాలు వర్తించడానికి ముందు- ఇది సాహిత్యరూపం అయివుండాలి. ఆ పదాలు వర్తించేందుకు కావలసిన కనీసార్హత ఈ రాతకి లేదు.

లోకంలో జరిగే సంఘటనల్ని కథగా మలిచే నేర్పుగాని, మనస్సులో కలిగే వూహల్ని మాటల్లో రచించగల శక్తిగాని లేని ఈ రచయిత చేసిన ఈ కథలోని కృత్రిమ నిర్మాణాలకి ఏ లోకంలోనూ అస్తిత్వం లేదు.

అయితే, గూడెంలో ఆడవాళ్లూ, అమరావతిని ఈసడించిన జనాభా, వాళ్ల మాత్రం ప్రాణవంతంగా రూపొందారు. వాళ్ల మాటలూ, ఆలోచనలూ సమర్థంగా చెప్పాడు రచయిత. కాని, ముఖ్య పాత్రలన్నీ- అమరావతి, అమరావతి తండ్రి, హిప్పీ విద్యార్థి, రిక్షావాడు- ఇవన్నీ అసమర్థ రూపాలుగా మిగిలిపోయాయి.

ఇది "ఆధునిక తెలుగు కవిత్వంలో నూతన మార్గం" అని నార్ల వెంకటేశ్వరావూ, "అభ్యుదయ పథంలో ఈ కావ్యం మరపురాని మైలురాయి" అని దాశరథీ, ఈరచనకి కితాబులియ్యడం ఎందువల్ల జరిగిందన్న విషయం పట్టించుకోదగినది కాదు. తెలుగు సాహిత్య రంగంలో పుస్తకాలమీద అభిప్రాయాలు రాసేవాళ్లకి అతిశయోక్తులు అలవాటు.

కాగా, ఈపుస్తకాన్ని మార్క్సిస్టు సిద్ధాంతమూ, వర్గచైతన్యమూ తప్పులని రుజువుచేసే పుస్తకంగా ఆర్. ఎస్. సుదర్శనం ప్రశంసించగా, ఆరుద్ర ఇందులో సోషలిస్టు వాస్తవికత వుందని, అమరావతి డీ-క్లాస్ అవుతోందనీ మార్క్సిస్టు కితాబులివ్వడం- అందుకోసం షోలకోవ్‌నీ, లూనచరస్కీనీ సందర్భశుద్ధి లేకుండా ఉదహరించడం, ముచ్చటైన విషయాలు.

ఈ పుస్తకానికి ముందుమాటలూ తొలిపలుకులూ రాసిన ఈజట్టు వాళ్ళధోరణి చూస్తే- ఇది ప్రస్తుతం ఆంధ్రదేశంలో సాహిత్యరంగంలో విప్లవకర సాహిత్య ప్రాబల్యాన్ని ఎదుర్కొనే ప్రయత్నంలో ఈ రచనని ఒకభాగం చెయ్యాలనే తాపత్రయంలా కనిపిస్తుంది. అయితే వీళ్ళకి ఇంతకన్నా మంచిపుస్తకం దొరక్క దీనిమీదే సర్వశక్తులూ కేంద్రీకరించారు. కాని, సాహిత్యం కానిదాన్ని సాహిత్యం చెయ్యడం ఎవడితరం? నిజంకానిదాన్ని నిజంచేయడం ఎవడితరం?

— వియ్యన్న

---

'కవికుల తిలకుడు' కాళిదాసు
గాలి తీసిన సరోజ్‌దత్తా
కవిత 'శకుంతల' వచ్చే సంచికలో....

---

# పువ్వుల కొరడా!

ఎ. అప్పల్నాయుడు

తుమ్మపాలెం ఊరు అంత పెద్దదీకాదు- అలాగని చిన్నదీకాదు. మధ్యస్తంగా వుంటుంది. దాదాపు మూడు వందల ఏభై యిళ్లుంటాయి ఆ ఊరిలో. అందులో చాలా తక్కువ సంఖ్యలో కొన్ని జాతుల వారున్నారు ... చాకలి, మంగలి. బారిక లాంటి తక్కువ జాతి వాళ్లు. ఇలాంటి కులం తక్కువ వాళ్లయిన చాకలివారు ఆరేడు కుటుంబాలున్నాయి ఆ ఊరిలో. ఈ ఆరేడు కుటుంబాల చాకలివారే ఆ ఊరి మురికి (బట్టలు) వుతికి బాగుచేస్తుంటారు. ఇలా బాగుచేస్తున్నందుకు వారికి ఏడాదికి యిన్ని అని చెప్తూ ధాన్యం లెక్కగట్టి ఆ వూరి ఆయా కుటుంబాల వాళ్లు యిస్తుంటారు. ఆరు ఏడు కుటుంబాల వాళ్ళు మూడువందలేభై యిళ్ల మురికి బట్టలు వుతకడం వలన అహర్నిషలు తీరికలేకుండా పనిజేస్తూంటారు. అయినా వీళ్ల బతుకులకు 'గడియ తీరదు, గవ్వ మిగలదు' అనే సామెత సరిపోతుంది. గవ్వ మిగలని చాకలోళ్లలో అసిరిసెట్టి ఒకడు. అసిరిసెట్టి ఈమధ్య అంటే మొన్ననే తన చిన్నకూతురుకి పెళ్లి చేసాడు. సరిగ్గా ఈ పెళ్లి రోజునే తుమ్మపాలెం నాయుడుగారు కూతురుకి 'బంగారంపేట' వూరు భూస్వామైన జగ్గు నాయుడుగారి ఎమ్మే చదివిన అబ్బాయిని యిచ్చి పెళ్లి చేసారు.

అసిరిసెట్టి కూతుర్ని తన చెల్లెలు కొడుక్కి యిచ్చి పెళ్లిచేసాడు, బంగారంపేట ఊరి భూస్వామిగారి ఎమ్మే అబ్బాయిని నాయుడుగారి కూతురుకిచ్చి పెళ్లిచేసారు- అని అనడానికి తేడా ఏమిటో తెలుసా మీకు?

అసిరిగాడి కూతురు పెళ్లికి అల్లుడే భరించాడు ఖర్చులన్నీ!

నాయుడుగారి అమ్మాయి పెళ్లికి, పెళ్లి ఖర్చులే కాక, పెళ్లికి కావలసిన సరుకులు కొన్నట్టే ఎమ్మే అబ్బాయిని అరవై వేలిచ్చి కొని తీసుకొచ్చి పెళ్లిచేసారు నాయుడుగారు! కనక అలా అనాల్సి వస్తోంది.

పెళ్లి కర్మా, కరమ్మత్తూ తగలని ఆసిరి గాడికి కూతురు అత్తారింటికి పయనమవుతుంటే ఏడుపొచ్చింది. ఏడుపొచ్చిన అసిరిగాడికి నాయుడింటి నుండి కబురొచ్చింది. కూతుర్ని పయనం చేయించేసి, అసిరిసెట్టి నాయుడుబాబింటికి వెళ్లాడు.

నాయుడు గారిల్లు యింకా పెళ్లికళతో వుంది. ఇంటిముందు పెద్ద పెళ్లి పందిరి, దాని క్రింద మంచాలు చల్లని నీడలో కూర్చున్న సింహాల్లా వున్నాయి. అరవై వేల రూపాయలు దాటి కర్చైపోయినా అరగని రోడ్డు రోలర్‌లావున్న నాయుడుగారు ఆ

పందిరి నీడలోని సింహాల్లాంటి మంచాల అన్నిటికంటే పెద్దదైన పందిరికోళ్ళ మంచం మీద కూర్చొని పడుకున్నారనొచ్చు ఆయన్ని చూసినవారు.

నాయుడు గార్ని చూసిన అసిరిసెట్టి పందిరికోళ్ళనీ, మంచాన్నీ, చూసి గతుక్కుమని, ఆ మంచానికి దూరంగా, ఒక వోరగా నిలబడ్డాడు. నిలబడిన అసిరి సెట్టిని.... కూర్చొని పడుకున్న నాయుడుగారు "ఏఁవిరా! యింకా పెళ్లి అడావిడి తీరనే దేట్రా నీకు! అలికిడే లేదిటు కేసి. యిదేటి పెళ్లి యిల్లు అనుకున్నావా, నేడా! లేక పోతే నీ కూతురి పెళ్లే ముక్యం అయిపోయిందా ఏటి?" అని (తన కూతురి పెళ్లి ఎక్కువగా భావించలేదీ సొకల్నా కొడుకు అని తన మనసులో అనుకుంటూ) అన్నారు.

"నేదు బాబో.... నానే వొద్దు మనుకుంతన్నాను యిక్కడికి. యింతలోకి మీరే కవురెట్టినారు"

"కవురెట్టకపోతే నువ్వొత్తావేట్రా. ఏసయి కాలం.... ఎండ.... ఏదెక్కిపోతావు గావా, గడప దాటవు నువ్వందుకే"

"అదేటి బాబో.... అలగంతారు. ఎండేటి. వోనేటి మాకు" ఇంతలో పెళ్లి కూతురు వారు నాయుడుగారి సెవిలో యేదో సెప్పడానికి వొచ్చారు.

పాలపిట్ట రంగు, బంగారం అంచుతో పట్టుచీర మెరుస్తోంది! మెరుస్తున్న చీరలో మెరవని పెళ్లి కూతుర్ని మెరిపెస్తున్నాయి నగలు, అలంకారాలు! అసిరిసెట్టి చూసాడు. పెళ్ళి కూతురంటే యిలా వుంటాది గావాల అనుకున్నాడు. పెళ్ళి కూతురైన తన కూతుర్ని తల్చుకున్నాడు. ఆమెకీ - ఈమెకీ పోల్చుకుంటున్నాడు. ఎత్తైన భవంతిలో విహరించే రాణిలాగా నాయుడుగారి కూతురు కన్పిస్తే, దాని కిందనున్న పూరిగుడిసె లోని దాసీ దానిలా కన్పించింది తన కూతురు. ఇక మరి ఆలోచించ లేక పోయాడు. పెళ్ళి కూతురు కూడా వెళ్ళి పోయింది. తర్వాత నాయుడుగారు కూడా మంచం మీద నుండి లేచారు, లేచి రా....రా సెట్టోడా, యింట్లోని గొడ్డలి దీసికెల్లి, కళ్లంలోన ఎండు దుక్కులున్నాయి. అవి ముక్కలుజేసు కొచ్చీరా" అని పిలిచి గొడ్డలి యింట్లో ఎక్కడుందో చెప్పేసి, లోనకి వెళ్ళి పోయారు.

కళ్లంలోకెళ్లి దుక్కుల్ని ముక్కలుజేసి గొట్టి, చెక్కలయిన వన్నీ ఏరుకొని మోపుగట్టి నాయుడుగారి వంటింట్లో పడేసి, తువ్వాలు గుడ్డతో మొహంమీది సెవట తుడుసుకుంటున్న అసిరిసెట్టిని జూసి, సేమ్యా పాయసం రుచి చూస్తున్న నాయురాలమ్మగారు "ఓరె, సెట్టోడా! మధ్యానం బేగి రమ్మిరా, వొంటలయిపోతాయి. వీరపు వారింటికి ఏనాలు కావిడొట్టు కెల్దువుగాని రమ్మిరో" అని అర్డరేసింది. ఆ ఆర్డరు వినగానే అసిరి

సెట్టి 'తన పనయి పోయిందిర బాబో' అనుకున్నాడు. "ఎండలు మండిపోతన్నాయి. ఇంత ఎండలోన కావిడి బరువుతోటి, ఏడెనిమిది మైయిల్లు దోవ వుంటాదావూరు, ఎల్లి రావడమంటే- మాటలా! సచ్చినాన్రా దేవుడా!" అనుకున్నాడు- దేవుడ్ని తలుసు కున్నాడు. "సాకలోడికి ఎందుకు పుట్టించావుర దేవుడా- అంతేలే, నీనేమి పాపం జేసానో యీజన్మెత్తాను- ఈజన్మెత్తినందుకీ కావిడి ఎత్తక తప్పదు గావాల!" అను కున్నాడు. యిలా ఆలోచిస్తూ యింటికొచ్చాడు.

ఇల్లంతా బోసిపోయివుంది. ఎవ్వరూ లేరు. ఒంటరి వాడయినాడు అసిరిసెట్టి చిన్న కూతుర్ని పెళ్లి చేసేసిన తర్వాత రెండేళ్ల కిందట అసిరిసెట్టి పెళ్లాం పోయింది. బట్టల మూట మోసుకొంటూ వీధిలో ఒస్తుంటే నాయుడుగారి పెద్ద కోడెద్దు రంకె లేసు కొస్తోంది. నాయుడుగారి రంకెలకి బలయిపోయిన అనేకమంది స్త్రీలలాగే నాయుడుగారి ఎద్దు రంకెలకు బలయిపోయింది అసిరిసెట్టి పెళ్లాం. ఎద్దు కొమ్ముతో కడుపులో పొడి సేసి పేగులు లాగేసింది. గావుమని అరిచి చచ్చిపోయింది అసిరిసెట్టి పెళ్లాం. చచ్చి పోయిన సెట్టి దాన్ని సూసి ఏడవకుండా వుండలేకపోయాడు అసిరిసెట్టోడు. ఏడుస్తున్న యిద్దరాడ కూతుళ్లనీ ఓదార్చలేకపోయాడు. ఏడుస్తున్న ముగ్గుర్నీ ఊరుకోమన్నాడు- సెట్టి దాన్ని ఖననం చేయించేసాడు నాయుడుగారు. సెట్టి దాని ఖననం అయిపోయిన రెండోరోజే పెద్ద కూతురు తన అత్తోరి యింటికి పెళ్లిపోయింది. వున్న చిన్నకూతుర్తో యిన్నాళ్లూ బతుకుతూ, బట్టలుతుకుతూ గడుపుకొచ్చాడు. ఇకనుండి ఒంటరే! ఎలా బతకడం! బట్టలుతికితే, వొంట వొండలేడు, వొండితే బట్టలుతకలేడు! గనక అసిరి సెట్టికి నాయుడుగారి పెద్ద ఎద్దు మళ్లీ రంకెలేస్తే బాగుండుననీ, సెట్టి దాన్లాగే ఆ ఎద్దు రంకెలకి బలయిపోతే బాగుణ్ణని అనిపిస్తోంది.

అపునంతే తెల్లారి లేసిందగ్గిట్నించి, రాత్రి తొంగొనే ఏలదాక, ఎదవ బాధ తప్పకపోతే యిక బతికెందుకు.

ఇలా బతుకెందుకని అనుకుంటున్న అసిరిసెట్టికి చావు కూడా ఎందుకో తెలీదు. చావూ, బతుకుల పరమార్థం తెలీని అసిరిసెట్టికి అయిదేళ్ల కొకసారొచ్చే ఎలక్షన్లంటే పండగనీ, ఆ పండగల్లో పెద్దవాళ్లు తమ దగ్గరకి వొస్తారనీ, సారా పోస్తారనీ, నోట్లి స్తారనీ తెలుసు. అయిదేళ్ల పండగంటే యింతే తెలుసు తప్ప, ఆ పండగ తర్వాత ఆ సదరు పెద్దలు ఎంజేస్తున్నారో, ఆ పండగల రహస్యాలేమిటో అసిరిసెట్టికి తెలీదు. ఎలక్షనంటే తెలీని అసిరిసెట్టికి ప్రజాస్వామ్యమూ, సోషలిజము అర్థం కాదు. ఇవేవీ అర్థం కాని అసిరిసెట్టికి స్వాతంత్ర్యమంటే ఏమిటో గూడా తెలీదనే అర్థం చేసుకోవచ్చును కదా మనం!

స్వాతంత్ర్యమంటే తెలియని అసిరిసెట్టిని నాయుడుగారు సరీగా మధ్యాహ్నం రెండుగంటల వేళ ప్రయాణం కట్టించారు– అరిసెల కావడిమీద చీరసారెలు పెట్టి వారి వియ్యపుల యింటికి!

ఈ కావిడి మోత తప్పడానికి తనకి జబ్బొచ్చినా బాగుణ్ణు! కాలిరిగిపోయుండినా బాగుణ్ణు అనుకున్నాడు. పుట్టించి నాడనుకుంటున్న దేవుడు దయతలిసినా బాగుణ్ణు! అయినా అసిరిసెట్టికి జబ్బు రాలేదు, కాలిరగలేదు.... దేవుడు దయసూపలేదు– కావిడి మోత తప్పలేదు పస సెట్టోడికి పాపం!

కావిడి భుజమ్మీదేసుకొని సరిజేసుకుంటున్న అసిరిసెట్టిని "జాగర్తరో, తోవలో నెక్కడేనా పడీసీగలవు సామాన్లు– అరిసె లవీ లెక్కెట్టీ ఎట్టాను, తక్కువని అన్నారా నీకు తొక్కలూడిపోతాయి సీ్మ!" అని నాయురాలు హెచ్చరించారు.

"సర్లేయే, ఆడికి తెల్దేటి? సెట్టోడా! మా ఈరకాడికి, ఈ సాయింత్రం అల్లుడూ కూతురు ఎలిపోవస్తారని సెప్పురా, ఏటి" అని నాయుడుగారు అంటే, నాయురాలు 'అల్లిద్దరేనేటి?' అని నాయుడిని ప్రశ్నించి, సెట్టోడికి మళ్ళీ "ఒరే! అల్లిద్దర్తోటీ మరో ఆరేడుగురు పేరంటాలు వొత్తారని సెప్పురా" అని అన్నారు.

ఇలా ఆఖరుసారిగా నాయుడూ, నాయురాళ్ల హెచ్చరికలూ, కబురులూ అయిపోయిన తర్వాత అసిరిసెట్టి అరిసెల కావిడి ఎత్తుకొని భుజమ్మీద సర్దుకొని పయనమై పోయాడు.

తుమ్మలపాలెం ఊరునుంచి కుడివైపుగా కొంతదూరంలో 'నాగావళి' నది పారుతోంది. దాన్ని దాటి ఆరు ఏడు మైళ్ళు దోవ వుంటుంది బంగారమ్మపేట వూరుకి– ఈ వూరువెళ్లే మధ్యలో రెండు వూర్లు తొడుము, మాదలంగి అనేవి తగుల్తాయి.

ఈ మాదలంగి అనేవూరే అసిరిసెట్టి పెద్దకూతురు అత్తవారుంటున్నది. ఎండలో కావడి మోత కష్టంగావున్నా, 'పోనీలే దోవలోనేకదా కూతురిల్లు సూసీవొచ్చు, సిన్నదాని పెల్లికి కూడా రానేదు ఎందుకోగానీ' అని అనుకుంటూ అసిరిసెట్టి పెద్దకూతురు గూర్చి ఆలోచించుకుంటూ తోవలోని ఒక వూరుదాటి పోయాడు.

మధ్యలో కొంతమంది తెలిసిన చిన్న చిన్న రైతులు కన్పించి "ఏటి సెట్టోడా! యింత ఎండేల కావిడొట్టికెలతన్నా వెక్కడికేటి?" అని అడిగారు. "అఁ మా నాయుడు బావు యీరకాలింటికి బాబు! బంగారంపేట" అని జవాబిస్తూ నడుస్తున్నాడు అసిరిసెట్టి.

'కూతురింటికి ఎల్లాల' అని అనుకున్నాడే గానీ అసిరిసెట్టికి, "ఎల్లిన్తరవాత దాని గుంటలు యిద్దరూ సూత్తారు తాత ఏటి తెచ్చాడో అనుకొని, తోవల ఏటేనా కొనుక్కోని తీసికెల్తే బాగున్ను" అనుకుంటండు. కానీ, జేబుల పైసాలేదు- తోవల కర్సులుంటాయని జేబుకి తెలీదు। పంపించిన బాబుకీ తెలీదు।

కాలీ జేబుల అసిరిసెట్టి, అరిసెల కావిడితో ఎలాగైతేమి మాదలంగి చేరుకొని, చెల్లెలింటికి ఎల్లాడు. చెల్లెలు అన్నను చూసి ఎగిరిపోయింది ఆనందంతో. "ఇదేట్రనాయినా! యింతెండల బయలెల్నావు ఒక సిటం తాలనేకపోయినావా" అంది.

"ఎంతెండయితే ఏటి జేత్తామే కూతురా! నాయుడోల్లకి ఎండ నేదుకదా! పందిరి కిందని, పందిరికోళ్ల మంచంమీదిన సక్కగ తొంగొంతరు. మనల్ని ఎండల తోలుతారు- ఏటి సేత్తాం మరి, ఎల్లపోపోతే తంతారు" అని చెప్పేసి "బాను గానీ, సిన్నమ్మికి పెల్లికి నువ్వు రాలేదేమే" అని అడిగాడు.

ఇంతలో అసిరిసెట్టి కూతురు పిల్ల లిద్దరూ వొచ్చారు- 'తాత్తాత!' అని ఓక్షణం గెంతేసి, తాతమీద ఆడేసికొని పెళ్లిపోయినారు- కూతురు: "వుండ్రయ్యా టీ తెత్తాను సింవాచెలం కొట్టుకాడ" అని సెట్టోడు వొద్దన్నా వినకుండా వెళ్లింది.

మాటల్లో అసిరిసెట్టి అరిసెల కావడి సూడ్డం మర్సిపోయినాడు. తాత ఏటే తేలేదని గ్రహించిన పిల్లలిద్దరూ కావిడి సేరుకున్నారు.

అసిరిసెట్టి కావిడి సూసాడు- గుండె లారిపోనాయి.

అసిరిశెట్టి పదిలంగా మోసుకొస్తున్న నాయుడుగారి ఆస్థిని దోచుకుతింటున్నట్లు కన్పించింది ఆ దృశ్యం।

ఇద్దరుపిల్లలూ, కావిడిదగ్గిర కూర్చుని చెరోరెండు, పంచదార అరిసెలు తింటున్నారు. నల్లగా చీముడు కారేముక్కుల్తో, దిశమొలల్తోవున్న ఆ పిల్లలు అరిసెల్ని ఆప్యాయంగాతింటూ పరిసరాల్నే మరిచిపోయారు!

అసిరిశెట్టికి నోట మాటరాలేదు. నాయురాలి హెచ్చరిక వినిపించింది. గుండెలు వొణుకుతున్నాయి. రెండు, రెండు నాలుగు అరిసెలు తక్కువ! అమ్మో! అయిపోద్దినాపని అనుకున్నాడు.

ఇంతలో కూతురొచ్చింది టీతో! అసిరిశెట్టి పిల్లల్ని సూపించాడు! తుళ్లిపడ్డాది కూతురు! "అమ్మో! అమ్మో! ఎదవ గుంటలకానా! ఎంతపని సేసార్రా. అవేటి మన తిండి కనుకున్నారేట్రో! " అని అడిగింది. అవి ఎవరికిండికో, ఎవరికోసమో అనే

సంగతి పిల్లలకు ఎలా తెలుసు? తెలీని పిల్లల్ని బాదీసింది తండ్రి కేటవుతాదో అనే భయంతో। పిల్లలు ఏడుస్తున్నారు. అసిరిశెట్టి మనసులో సంజాయిషీగూర్చి రిహార్సల్సు వేస్తున్నాడు. కూతురు తిడుతోంది, పిల్లల్ని కొడుతోంది.

అప్పుడే రేడియో 'శ్రీలంక' స్టేషన్ నుండి "పిల్లలూ దేవుడూ చల్లనివారే, కల్లకపట మెరుగనీ కరుణామయులే" వినిపిస్తోంది। పాట వినే నాధుడూ. కరుణించే మహనీయుడూ పిల్లలకీ, అసిరిసెట్టికీ, కూతురికి కన్పించనే లేదు।

కూతురిచ్చిన టీ తాగేసాడు, ఏడుస్తున్న పిల్లల్నొదిలేసాడు- బంగారంపేట చేరి, నాయుడుగారి ఎమ్మేల్లుడుగారి యిల్లు చేరుకున్నాడు.

నాయుడుబాబు యొక్క వియ్యపువారు కావిడి సరంజామా అంతా యింటిలో భద్రపరచుకొని అసిరిసెట్టికి కాలీ కావిడి యిచ్చేశారు. దాంతోపాటుగా ఒకరూపాయి కూడా యిచ్చారు.

ఒక రూపాయి!

కావిడి మోసిన అసిరిసెట్టికి, మోయించుకున్న జగ్గు నాయుడుగారు యిచ్చారు.

దాన్ని కూలి అంటారా ?

దాన్ని బహుమాన మంటారా ??

దాన్ని రూపాయే అంటాము ముందు మనము.

అది కూలీ కాదు, బహుమానమూ కాదు- భూస్వామ్య దర్పం విదిలించిన ఎంగిలి మెతుకు! ఫ్యూడల్ ప్రభువులు విసిరేసిన చిల్లర నాణెం !!

తరతరాలుగా గ్రామాల్లోని చాకలి, మంగలి, బారిక లాంటి జాతులు భూమిలేని కూలి రైతాంగంకంటే హీన స్థితిలో మగ్గుతూ, భూస్వాముల ఊడిగము చేస్తున్నారు. వారి కావిడి మోస్తున్నారు- సవారీ మోస్తున్నారు- కాళ్లు పడుతున్నారు- కర్రలు కొడుతున్నారు. ప్రతిఫలం యిదే రూపాయో, (లేక) ఎంగిలి మెతుకో !

ఇచ్చిన రూపాయి పుచ్చుకొని వారివద్ద సెలవు దీసుకొని అసిరిసెట్టి తిరిగి ప్రయాణమయ్యాడు.

ప్రతీ కార్యక్రమం యొక్క ఫలాఫలాలు వెంటనో. తర్వాతనో తప్పకుండా వుంటాయి.

నాలుగు అరిసెలు లెక్కతెలియవృతే అని వేధించే మనసుని సరిపెట్టుకునేవాడు అసిరిసెట్టి.

పెళ్లితంతులో యిచ్చిపుచ్చుకొనే సమయాల్లో లెక్కలు అచ్చితంగా వెల్లడౌతాయి. అవేమి ప్రణాళికా లెక్కలు కావుగా! ఆ రకంగానే నాలుగరిసెలు తక్కువయ్యాయని వెల్ల డైంది. వియ్యపువారు నాలుగు వేలు తక్కువలా వ్యాఖ్యానాలు ప్రారంభించారట.

నాయురాలకి తెలిసింది— "ఎందుకు తక్కువొస్తాయి, ఎదవ, యీ సాకలోడి పనే అది" అని ఎగిరిపోయింది. నాయుడిని పిలవమన్నది సాకలోడిని. సెమ్మా లూడగొట్ట మన్నది. సెర్మం వొలిసి డప్పుగట్టమన్నది. డప్పుగట్టీసి వాయించమంది. "లేకపోతే బాగోదు, సూడండి వియ్యపువారు మనకి ఎలాగ వాయించేస్తన్నారో" అని నాయుడిని వాయించేసింది.

రాజు తల్చుకుంటే దెబ్బలకు కొదువా! నాయుడు తల్చుకున్నాడు— పువ్వుల కొరడా పట్టుకున్నాడు— అంతే.... నరాలు జివ్వుమని తెగిపోతున్నాయి అసిరిసెట్టికి. వీపుమీద కొరడా దెబ్బలు అచ్చులు పడి, దెబ్బ దగ్గర చర్మం చిరిగిపోతోంది. నాయు రాలు కోరినట్టుగా ఊడడంలేదు. ఊడితే డప్పు కట్టడంకోసం నాయుడుగారు కొడుతు న్నారు. దెబ్బదెబ్బకీ చెర్మం చిరిగి, నరాలు తెగి రక్తం కారుతోంది.

ఎర్రగా.... కారుతోంది రక్తం!

పువ్వుల కొరడా.... ఎరుపయిపోతోంది!

నాయుడుగారి పందిరికింద గచ్చుమీద ఎర్రటి నెత్తురు మరకలు పడుతున్నాయి! రక్తం! ఎర్రటి రక్తం! సింధూరం లాంటి, తొలిసంధ్య లాంటి రక్తం! నరజాతి చరిత్ర సమస్తం రక్తసిక్తం! అపును చరిత్రనిండా రక్తమే! ఈ రక్తమే చరిత్రని మార్చింది!

ఈ రక్తమే చరిత్రని మార్చుతుంది!

రక్తాల ధారలు, అమ్మ నాయినా కేకలూ నాయుడుని శాంతింప జేయలేదు! అసిరిసెట్టికి వీపు మండుతోంది! కావిడి వద్ద పిల్లలు ఆప్యాయంగా తింటున్న దృశ్యం కన్పించింది! భయం, బెదురూ లేని వారి రూపాలు, వారి అమాయక మొహాలు అసిరిసెట్టిని కదిలించాయి.

అంతే, అసిరిసెట్టి కదిలాడు— నిటారుగా నిప్పులా లేచాడు— కొరడాకంటే వేగంగా.... కత్తికంటే పదునుగా, నాయుడుకంటే బలంగా లేచాడు!

భూస్వామ్య, ఫ్యూడల్ నిరంకుశత్వం మీద ఎదురుదెబ్బ వేసాడు!

పువ్వుల కొరడా అసిరిసెట్టి చేతిలో విరిగిపోయింది.

ఒక సినిమా కథ

# నేనూ ఎర్రసైనికుడి నౌతా

1931వ సంవత్సరం. కియాంక్సీ రాష్ట్రంలో రెండవ, విప్లవ అంతర్యుద్ధకాలం. కొమిన్‌టాంగ్ వారి మొదటిమూడు 'చుట్టుముట్టి అణిచివేత' ఎత్తుగడలను విజయవంతంగా తిప్పికొట్టిన చైనా కార్మిక కర్షక ఎర్రసైన్యం, ఛైర్మన్ మావో నాయకత్వాన వరుసగా విజయం తర్వాత విజయాన్ని సాధిస్తూ తమస్థావరాలను విస్తృతం చేస్తున్నది.

పదిసంవత్సరాల వయసున్న పాన్‌టుంగ్ చు, విల్లోబ్రూక్ గ్రామంలో ఒక దళ నాయకుడి కొడుకు. గ్రామానికి వెనుకవైపున్న కొండకింది అడవిలో టుంగ్ చు కట్టెలు కొడుతున్నాడు. క్రూరుడైన భూస్వామి హూ హన్‌సన్ నిరంకుశత్వం నుండి తమను విముక్తి చేయగల ఎర్రసైన్యం తమగ్రామానికి ఎప్పుడు వస్తుందాఅని ఎంతో ఆతురతతో ఎదురుచూస్తున్నారు విల్లోబ్రూక్ గ్రామప్రజలు. ఇంతలో దూరంగా రైఫిళ్ల గర్జన. కట్టెలు కొడుతున్న టుంగ్‌చు గబగబా ఒకచెట్టుఎక్కి కనుచూపుమేరలో విముక్తి సేనలు కనిపిస్తవేమోనని కళ్ళను కాగడాలు చేసుకుని చూస్తాడు.

టుంగ్ చు తండ్రి పాన్ సింగ్ ఇ, తమ గ్రామానికి రాబోతున్న విముక్తిసేన అకు దారిచూపడానికి అప్పుడే గ్రామం విడిచివెళ్ళాడు. కనుచూపుమేరలో ఎర్రసైన్యం కనపడక పోవడంతో, ఇక చెట్టుదిగి కట్టెలమోపుతో ఇంటికి బయలుదేరుతాడు టుంగ్ చు. అదేసమయంలో తన తొత్తులతోసహా గ్రామంవిడిచి పారిపోతున్న భూస్వామి హూ హన్‌సన్, టుంగ్ చును పట్టుకుని, తండ్రి ఎక్కడకు పోయాడో చెప్పమని బెదిరిస్తాడు. ఆపిల్లవాడు చెప్పనంటాడు. హూ, టుంగ్ చు చేతులుకట్టి చెట్టుకు వేళ్ళాడదీసి కొట్టినాకూడా ఆపిల్లవాడు నోరువిప్పడు ఆసమయంలో పాన్ సింగ్-ఇదారి చూపుతుండగా ఒక ఎర్ర సైనికదళం గ్రామంవైపుకు దూసుకువస్తుంది. తమ ప్రాణాలను కాపాడుకోడానికి హూ హన్‌సన్, వాడితొత్తులు కాలికిబుద్ధి చెప్తారు. ఎర్రసైనిక దళపు అధికారి వూ సూ-చూ, వెంటనే టుంగ్ చు చేతికట్లువిప్పి కిందికి దింపుతాడు. "ఛైర్మన్ మావో నాయకత్వానఉన్న ఎర్రసైన్యం, కమ్యూనిస్టుపార్టీ నిన్ను కాపాడాయి" పాన్‌సింగ్ ఇ, కొడుకుతో అంటాడు. వూ టోపీపైఉన్న మెరుస్తున్న ఎర్రటి నక్షత్రాన్ని నూతనోత్సాహంతో చూస్తాడు ఆపిల్లవాడు. చైనా కార్మిక కర్షక ఎర్రసైన్యానికీ, కమ్యూనిస్టుపార్టీకి, విప్లవానికి ప్రతీకఅయిన ఆ అరుణతారను చూడగానే టుంగ్ చు హృదయం అభిమానంతో నిండిపోతుంది.

విల్లోబ్రూక్ గ్రామం విముక్తి కాగానే, కార్మిక కర్షక ప్రజాస్వామిక ప్రభుత్వం నాయకత్వంలో పేదరైతాంగం, స్థానిక నిరంకుశుల అధికారాన్ని కూల దోసింది.

భూమిని పంచారు. బంధించబడిన హూహాన్‌సన్‌కు వ్యతిరేకంగా విమర్శను కొనసాగించే సమావేశాలను నిర్వహించుతారు. గ్రామాన్నంతా పెద్దపెద్ద పోస్టర్లతోనూ, ఎర్ర జెండాలతోనూ అలంకరించి ప్రజలు తమ విముక్తిని ఎంతో ఉత్సాహంగా జరుపుకుంటారు. తన ఇంటి గోడమీద టుంగ్ చు ఒక పెద్ద ఎర్ర కాగితపు నక్షత్రాన్ని అంటిస్తాడు. ఊరేగింపులో విజయోత్సాహంతో ఎర్రలాంతరు పట్టుకుంటాడు. తన బడి సంచీపై ఒక ఎర్ర నక్షత్రాన్ని అందంగా కుట్టించుకుంటాడు. ఎర్ర కుచ్చుతో ఉన్న ఒక ఈటెను పట్టుకుని రోజూ బడికి పోతూంటాడు. కొత్తగా ఏర్పడ్డ చిన్న పిల్లల దళంలో చేరుతాడు. ఒకరోజు చిన్న పిల్లల దళంలోని మిగతా పిల్లలతో ఆడుతూ, టుంగ్ చు ఒక పొదలోకి పోతాడు. అక్కడ, గ్రామాన్నుండి పారిపోవ ప్రయత్నిస్తున్న హూహాన్‌సన్‌ను అకస్మాత్తుగా చూస్తాడు. వేగంగా ముందుకు దూసుకుపోయి వాడిని కదలకుండా పట్టుకుంటాడు. హూ, టుంగ్‌చును తోసివేయడానికి చేసే ప్రయత్నంలో ఇద్దరూ కింద పడతారు. హూ, టుంగ్ చును స్పృహ తప్పేటట్టుగా కొట్టి, పారిపోతాడు.

* * *

విప్లవ మార్గం ఎప్పుడూ సాఫీగా ఉండదు. కేంద్ర విప్లవ స్థావరాన్ని చుట్టుముట్టి అణచివేయడానికి 1934 లో కొమిన్‌టాంగ్ విప్లవ ప్రతిఘాతకులు పది లక్షల సైన్యాన్ని పోగేశారు. సరిగ్గా అదే సమయంలో పార్టీలో వామపక్ష అవకాశ పంథా బలంగా ఉంది. నాయకత్వం చైర్మన్ మావో నుండి వామపక్ష అవకాశవాదుల చేతుల్లోకి పోయింది. ఎర్రసైన్యం నాయకత్వం కూడా వారి చేతుల్లోకి పోవడం జరిగింది. ఫలితంగా 5వ 'చుట్టుముట్టి అణచివేసే' ఎత్తుగడను నాశనం చేయడంలో ఎర్రసైన్యం విఫలమయింది. కియాంక్సీ స్థావర ప్రాంతాన్నుండి ఉపసంహరించుకుని ఎర్రసైన్యం దీర్ఘయాత్ర (Long March) కు నడుం కట్టాల్సిన అవసరం ఏర్పడింది. ఇతర రెడ్ గార్డ్‌లలాగే ఎర్రసైన్యంలో చేరిన పాన్‌సింగ్ ఇ కూడా దీర్ఘయాత్రకు సిద్ధమవుతాడు. తన కొడుకును విప్లవ పోరాటంలో కాకలుతీరేటట్లుగా చేయమని "వీడు విప్లవకారుల బిడ్డ. పెరిగి పెద్దవాడై మన ఆశయాన్ని కొనసాగించే వాడుగా విప్లవమార్గంలో నడిపించాలి" అని భార్యను కోరతాడు.

తండ్రి చేతుల్లో కెగిరి, టోపీపైనున్న అరుణతారను తాకడానికై పైకెగబాకుతూ టుంగ్ చు తండ్రితో "నాన్నా నువ్వెళ్ళిపోగానే నేను త్వరగా పెరిగి పెద్దవాడినయి, నీలాగే నా టోపీపై ఎర్ర నక్షత్రాన్ని పెట్టుకుంటా". పాన్‌సింగ్ ఇ తన జేబులోంచి

సైన్యపు టోపీకుండే ఒక ఎర్ర నక్షత్రాన్ని తీసి కొడుకు కిస్తూ "నాకు తెలుసు. నువ్వు ఎప్పుడూ కావాలని కోరుకునేదీ, ఎక్కువగా అభిమానించేదీ దీనినే. ఈ ఎర్ర నక్షత్రాన్ని నీ కిచ్చేస్తున్నా. నీకెప్పుడు కష్టాలెదురయినా దానివైపు చూడు. దాని అర్థం ఏమిటో ఆలోచించు. అప్పుడు నువు ఏంచేయాలో, కష్టాల్ని ఎలా అధిగమించాలో తెలుస్తుంది. ఇపుడు నువ్వు చిన్న పిల్లల దళ సభ్యుడవు. నువు పెరిగి పెద్దవాడవు కాగానే ఎర్ర సైన్యపు యోధుడవు కాగలవని నాకు తెలుసు,"

ఎర్రసైన్యం ఆ గ్రామంనుండి వెళ్ళిపోగానే హు హన్‌సన్, వాడి 'తెల్లశాంతి రక్షక దళాలు' తమ అధికారాన్ని మరల నిలబెట్టుకోడానికి గ్రామానికి తిరిగివస్తాయి. ఆ గడ్డురోజుల్లో, శత్రువు తనఎదురుదాడిని ఎలా కొనసాగించేదీ, ప్రజానీకాన్ని మూకుమ్మడి హత్యాకాండకు ఎలాగురిచేసేదీ, గ్రహిస్తాడు టుంగ్ చు. పార్టీసహాయంతో టుంగ్-చు అతనితల్లి పర్వతాలలోకి పోతారు. రాత్రింబగళ్ళు, ఎర్రసైన్యం మళ్ళీ ఎప్పుడుతిరిగి వస్తుందా,అని కళ్ళలో వత్తులేసుకుని ఎదురు చూస్తుంటాడు టుంగ్ చు. ఆకష్టపుదినాల్లోనే టుంగ్ చు తల్లి పార్టీలో సభ్యురాలవుతుంది. ఆమె ప్రమాణం చేస్తున్నపుడు, ఎగురుతున్న ఎర్రజెండా వైపుచూస్తూ పిడికిలి బిగిస్తూ, టుంగ్ చు, తల్లితో "అమ్మా! నువ్వు ఇప్పుడు పార్టీసభ్యురాలవు. నీకొడుకును కాబట్టి నేనుకూడా పార్టీ వాడినే. నన్ను పార్టీ ఏంచేయమని అడిగినా చేస్తాను." అంటాడు

దీర్ఘ యాత్రాకాలంలో 1935 జనవరిలో పార్టీ కేంద్రకమిటీ పొలిట్‌బ్యూరో విస్తృత సమావేశం క్వీచౌరాష్ట్రంలోని సన్-యిలో జరుగుతుంది. ఆ సమావేశం పార్టీ నావరించివున్న తప్పుడురాజకీయ పంథాను విడనాడి పార్టీకి, ఎర్రసైన్యానికి, ఛైర్మన్ మావో నాయకత్వాన్ని ఆమోదించింది. ఛైర్మన్‌మావో ప్రత్యక్ష నాయకత్వంలో ఎర్ర సైన్యంమరల, విజయం తర్వాత విజయాన్ని సాధించింది.

ఛైర్మన్‌మావో, పార్టీ, ఆదేశాలను ప్రచారంలో పెట్టడానికి, గెరిల్లా యుద్ధానికి ప్రజలను తయారుచేయడానికి, పార్టీ, టుంగ్-చు తల్లిని గ్రామాలకు పంపుతుంది. టుంగ్ చు దారిలో అంగరక్షకుడిగా తల్లిని అనుసరిస్తాడు.

ఒకరోజు ఆమె పార్టీ ఆదేశాలను ప్రజలకు వివరించే సమయంలో హు హన్ సన్ 'తెల్లసైనికుల'తో అక్కడికొస్తాడు. గ్రామస్థులందరూ అక్కడినుండి తప్పుకోడానికి వీలుగా, శత్రువుదృష్టి ప్రజలపైనుండి తనవైపు తిప్పుకోడానికి, టుంగ్ చు తల్లి ఒక చిన్నగుడిసెలో రక్షణ తీసుకుని కాల్పులుసాగిస్తుంది. చుట్టుపక్క పొదల్లో దాక్కొన్న గ్రామస్థులు ఆమెకు సహాయంగా పోబోతారు. కాని టుంగ్ చు "అమ్మ ఒక కమ్యూనిస్టు.

ప్రజలు కష్టాలకు గురికావడం తనకిష్టం ఉండదని నాతోచెప్పింది" అని వాళ్ళను అప్పుతాడు. అతనితల్లి చంపబడుతుంది. కానిఆమె విప్లవకర వీరత్వం టుంగ్ చు హృదయంలో ఎప్పటికీ చెరగని ముద్రగా నిలిచిపోతుంది.

టుంగ్-చు ఇక అక్కడి నుండి, వు సూ-చూ నాయకుడుగా ఉన్న గెరిల్లా స్థావరానికి పోతాడు. తండ్రి ఇచ్చిన ఎర్రినక్షత్రాన్ని చాపిన చేతిలో పట్టుకొని వు సూ-చూకి చూపుతూ, క్రోధంతో, కన్నీళ్ళతో, "మామయ్యా, నన్ను నీతో తీసుకుపో. నేనుకూడా ఎర్రిసైన్యంలో చేరుతాను" అంటూ బతిమాలుతాడు.

* * *

ఆకాశమే కప్పుగా, నేల పరుపుగా, చెట్ల ఆకులూ పళ్ళూ ఆహారంగా, గెరిల్లాలు పర్వతాల్లో ప్రయాణంచేస్తున్నారు. ఎన్ని కష్టాలొచ్చినా జంకకుండా టుంగ్చు వారితో బాటే పోతూవుంటాడు. తను కూడా వారితో కలిసి శత్రువు నెదుర్కొంటాడు. ఒక యుద్ధంలో ధైర్యంగా బ్రిడ్జిపై పలకలను తీసేసి శత్రువు పలాయనమార్గాన్ని అడ్డగిస్తాడు. శత్రు సైనికులు నీటిలో పడిపోవడంతో, గెరిల్లాలు వారిని బంధిస్తారు. ఒకసారి గెరిల్లాలకు బాగా అవసరంగా ఉన్న ఉప్పు తేవడంకోసం టుంగ్-చు, సుంగ్ తాతతో బాటు శత్రు ఆక్రమిత ప్రాంతంలోకి పోతాడు. ఉప్పును నీటిలో కరగేసి, ఆ నీటిలో తన దళసరి దూది చొక్కాను ముంచి, ఉప్పునీరు దూదిలో ఇంకిపొయ్యేటట్టు చేస్తాడు. ఆ విధంగా సరిహద్దు ప్రాంతంలో శత్రువుదృష్టి తనమీద పడకుండా తెలివిగా గెరిల్లాలకు ఉప్పు చేరేస్తాడు. గెరిల్లాలు టుంగ్చు రక్షణ విషయంలో ఎంతో శ్రద్ధ తీసుకుంటారు. అతనికోసం దళసరి దూది చొక్కాలు తయారుచేస్తారు. విప్లవాన్ని గురించి ఆ పిల్లవాడికి వివరించడానికి అన్ని అవకాశాల్ని వినియోగిస్తారు. పోరాటాన్ని గురించి లోతైన అవగాహన పెంపొందించుకోడానికి తోడ్పడుతారు.

ఆ విప్లవకారుల మధ్య టుంగ్ చు క్రమంగా తన అవగాహన పెంపొందించుకొని పరిపక్వమవుతాడు. దళ నాయకుడు ఒక రోజు, కష్టమయిన ఒక కొత్త పనిని టుంగ్చుకు అప్పగిస్తాడు. శత్రువుల కన్నుకప్పి, శత్రు ఆక్రమిత ప్రాంతం యెనాన్ లోకి పోవాలి. అక్కడ శత్రువులకు బియ్యం రవాణాచేసే దుకాణంలో పనివాడుగా చేరి శత్రువుల ఎత్తుగడల, కదలికల గురించి సమాచారం సేకరించి పంపాలి.

సుంగ్ తాత, టుంగ్ చును వెదురు తెప్పపై నదిని దాటిస్తాడు. ఆకాశంలో ఎగిరే పక్షులవంక చూస్తూ, పార్టీ బోధనలను తాను ఎప్పుడూ మరచిపోననీ, తన కప్పగించబడిన కొత్త పనిని ధైర్యంగా నెరవేరుస్తానని ప్రతిజ్ఞ తీసుకుంటాడు.

* * *

బియ్యం దుకాణంలో టుంగ్ చు, కావోచెన్‌షాన్ అన్న మారుపేరుతో, దుకాణపు యజమాని, జిత్తులమారి, పెన్ వద్ద నమ్మకస్థుడన్న పేరు సంపాయించాడు. నిలకడతో, చలాకీ తనంతో, విలువయిన సమాచారాన్ని సేకరిస్తాడు. టుంగ్ చు మిత్రుడు చన్ యా చూ కూడా అక్కడ పనివాడుగా చేరుతాడు. సుంగ్‌తాత మేదరివాడుగా చేరుతాడు. టుంగ్ చు వీళ్ళిద్దరి సహాయంతో, 'తెల్లసైనికుల'కు రవాణా గావడానికి సిద్ధంగాఉన్న బియ్యపు బస్తాలను స్వాధీన పరుచుకోమని అక్కడి ప్రజలను పురిగొల్పుతాడు. అవిధంగా, పర్వతాల్లోకిపోయి గెరిల్లాలపై దాడిచేయాలన్న, శత్రువుల ఎత్తుగడలను భగ్నంచేస్తాడు.

నేరుగా శత్రుఆక్రమిత ప్రాంతంలోనే పోరాటం సాగిస్తున్న టుంగ్ చు మెదడులో ఎప్పుడూ ఛైర్మన్‌మావో, పార్టీ, గురించి ఆలోచనలే. అప్పటికి ఛైర్మన్‌మావో నాయకత్వంలో ఎర్రసైన్యం 6000 మైళ్ళ దీర్ఘయాత్రను పూర్తిచేసి ఉత్తరపెన్సి చేరుకుంది. దేశమంతా ఛైర్మన్‌మావో, కేంద్రకమిటీల నాయకత్వంలో విప్లవ పోరాటం నడుస్తోంది. టుంగ్ చు, చన్ యాచూ లిద్దరూ కిటికిలోనుండి వెన్నెల వెలుగుతో నిండిన ఆకాశంలో ఉత్తర నక్షత్రాన్నిచూస్తూ అబ్బా! పక్షుల్లాగే మనకుకూడా రెక్కలుంటే ఎంతబాగుండును. రయ్యమని ఆ ఉత్తరనక్షత్రం దిక్కుగా ఏనాన్‌కి ఎగిరిపోయి ఛైర్మన్‌మావోను చూసివచ్చి వుండేవాళ్ళం కదూ' అని అనుకుంటారు. హూ హాన్ సన్‌ను, వాడి తెల్లసైన్యాన్ని, గెరిల్లాలు ఓడించడానికి, విప్లవ స్థావరాలనన్నిటిని తిరిగి ఆక్రమించుకోడానికి తాము సహాయపడాలని, మళ్ళీ మళ్ళీ నిశ్చయించుకుంటారు.

ఒకరోజు దుకాణపు యజమాని పెన్‌తో కలిసి తింటానికి, తాగడానికి వచ్చిన, తన పాత వర్గశత్రువు హూహాన్‌సన్‌ని కలుసుకుంటాడు టుంగ్ చు. సగం తాగిన స్థితిలో ఉన్నా, హూ, టుంగ్ చుని అనుమానిస్తాడు. జిత్తులమారి ప్రశ్నలతో, బెదిరింపులతో, టుంగ్ చు గుట్టుపట్టులు బయటకులాగాలని విశ్వప్రయత్నంచేస్తాడు. కాని ఆ పిల్లవాడు తొణకకుండా, తనను గురించి ఏమాత్రం తెలియనివ్వడు. వాడు, ఇక గుర్తుపడతాడనగా, గది బయట దాక్కొన్న చన్‌యాచూ పెద్దగా "కావ్ చెన్‌షాన్! మీ అమ్మ నీకోసం ఎదురుచూస్తున్నది" అని అంటూ బయటకు పిలిచి టుంగ్‌చుని ఆ ప్రదేశం వదిలిపెట్టి వెళ్ళిపొమ్మని బతిమాలుతాడు. కాని హూహాన్‌సన్‌ను చంపేంత వరకూ పోకూడదని టుంగ్ చు నిశ్చయించుకుంటాడు. ఆరోజు రాత్రి కొంత సమాచారంతోచన్‌యాచూని గెరిల్లాల వద్దకు పంపుతాడు. తర్వాత తన ఎర్రకుచ్చు ఈటెను, ఒకడబ్బాలో కిరోసిన్ తీసుకుని, మునివేళ్ళపై చడీచప్పుడూ లేకుండా నడుస్తూ హూ తాగి

పడుకున్న గదిలోకి పోతాడు. హు దుప్పటి మీదంతా కిరోసిన్ చల్లి అగ్గిపుల్లతో దుప్పటి నంటిస్తాడు. మంట సెగకి పరుపుమీదనుండి నేలపైకి దొర్లిన హు పక్రకు చూస్తాడు. "ఆఁ నువ్వా...." అంటూ భయంతో వణికిపోతాడు. టుంగ్ చు తన ఎర్రకుచ్చు ఈటెను పైకెత్తి "అవును. నేనే. ఎర్రసైనికుడిని. పాన్ టుంగ్ చుని" అంటూ వర్గకసి పెల్లుబుకుతూ ఉంటే తన బలాన్నంతా కూడదీసుకుని ఈటెను, హు హన్ సన్ గుండెల్లోకి దింపుతాడు. బియ్యం దుకాణం మంటల్లో తగులబడిపోతుంటే బయటకు పరిగెత్తి, అపుడే టౌన్ లోకివచ్చి తెల్లసైన్యాన్ని తుడిచివేస్తున్న గెరిల్లాలతో కలుస్తాడు.

*　　　*　　　*

"ప్రజలు, గెరిల్లాలు ఉత్సాహంతో విప్లవగీతాన్ని పాడుకుంటారు. విప్లవ విజయాన్ని సూచిస్తున్నట్లుగా భవిష్యత్ పోరాటాలకు సంకేతాలుగా వసంతం వస్తుంది. పువ్వులు వికసిస్తయ్, పర్వతాలు ఎర్రతివాచీలు కప్పుకున్నట్లుగా కనిపిస్తున్నయ్. పర్వత శిఖరాలు, ఉదయిస్తున్న సూర్యుడి, ఎర్రటికాంతిలాగా జ్వలిస్తున్న కాగడాల్లా అరుణారుణంగా ఉన్నవి. ఎర్రసైన్యం తిరిగివస్తుంది. ఎర్రసైన్యపు సభ్యుడయిన టుంగ్ చు తండ్రిని కలుస్తాడు.

"నాన్నా నువ్విచ్చిన ఎర్ర నక్షత్రాన్ని ఇన్ని సంవత్సరాలు, నాతో ఉంచుకున్నాను."

"వూ మాప నీ టోపీపైన ఈ ఎర్రనక్షత్రాన్ని పెట్టాడుకదూ" అడుగుతాడు పాన్ సింగ్ ఇ.

"అవును. కాని ఆనక్షత్రాన్ని తనగుండెల్లో ఎప్పటినుండో పదిలంగా దాచుకున్నాడు" అంటాడు అక్కడేఉన్న వూసూచు "ఇంతకాలం, ఆ నక్షత్రమే అతని చుక్కాని అయింది. వెనుకడుగు వేయకుండా మునుముందుకే పోవడానికి సహాయపడింది." పాన్ సింగ్ ఇ కొడుకుతో "బాబూ. నిన్ను తీర్చిదిద్దింది కమ్యూనిస్టు పార్టీయే నన్న విషయాన్నినువ్వు ఎపుడూ మరిచిపోవద్దు. మనముందున్న మార్గం సుదీర్ఘమయింది. మనంవేసే ప్రతిఅడుగు జాగ్రత్తగా వేయాలి. ఛైర్మన్ మావో విప్లవ పంథాననుసరిస్తున్నామా? లేదా? అని జాగ్రత్తపడాలి."

*　　　*　　　*

(ఇదిఒక సినిమాకథ. చైనాలోసినిమాలు 'రేపటిపౌరుల'ను స్వార్థరహితులుగా, విప్లవకారులుగా 'కొత్తమనుషులు'గా తీర్చిదిద్దే విప్లవబాధ్యతను ఎలానిర్వహిస్తున్నదీ తెలియజేస్తుందీకథ.)

# జైల్లో ఒక రోజు

ఉపాధ్యాయ

ఈదర గాలికి చలేస్తుంది.

ఎండపొడకు కుర్చీలో కాఫీ తాగుతూ కూర్చున్నా.

కాఫీతాగుడు పూర్తిచేసి చుట్ట అంటించారు నా ముందర కుర్చీలో కూర్చున్న విశ్వేశ్వరరావుగారు.

"ఆకాశం అందుకునే ధరలొకవైపు
అదుపులేని నిరుద్యోగ మింకొకవైపు
అవినీతి బంధుప్రీతి చీకటి బజారు
అలముకున్న నీదేశం ఎటు దిగజారు?"

శ్రీశ్రీ పాట పక్కనున్న రేడియో నుండి వస్తూంది.

వయసుమళ్లిన బోసినోటి విశ్వేశ్వరరావుగారికి ఆంగ్లము నేర్చుకోవాలనే వాంఛ మాత్రము సడలలేదు. ఒక పనిని సాధించటంలో అంత పట్టుదల చూపె అతన్ని అభినందించక ఉండలేను. అందుకే అతని చుట్ట పొగను భరిస్తూ, అతను తెచ్చిన ఇంగ్లీష్ ఎక్సర్‌సైజెస్‌ను సరిచేస్తున్నాను.

'సార్' అంటూ పెద్దగా ఎవరో పిలిచారు.

'ఎవరబ్బా' అనుకుంటూ వెనుదిరిగాను.

నాకనులు నేనే నమ్మలేకపోయాను.

ఎదురుగా జన్నయ్య.

చేతిలోవున్న నోట్‌బుక్ అక్కడే పడేసి 'జన్నయ్యా' అంటూ నడిచాను.

అతడు కష్టంగా 'సార్' అంటూ చూడరానిది చూసినట్లు వణుకుతూ తన చేతులతో నా చేతులు గట్టిగా పట్టున్నాడు. అతన్ని నా హృదయానికి హత్తుకున్నా.

ఇట్లా ఎంతసేపు ఉన్నామో.

చివరికి నేనే "రా, కూర్చో" అన్నాను.

బయట కుర్చీలో కూర్చోటానికి జంకాడు.

విషయాన్ని అర్థం చేసుకొని బారెక్‌లోనికి పోయాము. అప్పటికే మా చుట్టూ మంది కూడారు.

అతన్ని గురించి వివరాలు తోటి డిటెన్యూలకు చెప్పాను.

"మిమ్ముల్ని ఎందుకు తీసుక వచ్చిండ్లు, సార్ ?" కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ జన్నయ్య అడిగాడు.

"ప్రభుత్వానికి గిట్టకపోతే ఎవరైనా జైల్లో పెడుతారు" పక్కతను జవాబు చెప్పాడు.

"మీకు ఎన్నేండ్లు శిక్ష పడ్డది" తిరిగి జన్నయ్య ప్రశ్నించాడు.

"మమ్ముల్నందరిని రాజకీయ ఖైదీలుగా నిర్బంధించారు. ఎన్ని సంవత్సరాలైనా ప్రభుత్వం మమ్ముల్ని ఇందులో ఉంచవచ్చు."

"సార్, ఇంటికాడ అమ్మ వాళ్ళంత ఎట్ల బతుకుతాండ్లు ?" అంటూ పసిపిల్ల వాడిలా ఏడ్చాడు.

ఈరోజు 'లేనివారికి సేవ చేసేవారెవరైనా ఉన్నారా ?' అని ప్రశ్నిస్తే, జన్నయ్యనే చూపిస్తా. ఎప్పుడూ ఇతరులకు సేవ చేయాలనే మనస్తత్వం. తన రిక్షాలో తరచుగా కుంటి, గుడ్డి వాళ్ళకు, రోగులకూ చోటులభిస్తూవుంటుంది. ప్రొద్దస్తమానం రిక్షా లాగినా ఆరోజు తను, తన భార్య, బిడ్డ పొట్టపోసుకో గలిగితే, అదే తృప్తి. మంచి రోజులకై కష్టాలను ధైర్యంగా, ఎదుర్కొనే శ్రమజీవి. జన్నయ్య యీ జైల్లో 'సి' క్లాస్ ఖైదీగా ఎందుకు శిక్ష అనుభవిస్తున్నాడో? అమాయకురాలైన అతని భార్య, చిరునవ్వులు చిందించే అతని పసిపాప, నా స్మృతిలో ఒక్కసారి తళుక్కుమన్నారు. నా అనే దిక్కులేని ఆ దీనుల గతి ఏమయిందో– ఈ ఆలోచన నన్ను కదల్చివేసింది.

"ఇంట్లో అందరూ, నీ భార్యా, బిడ్డలూ బాగున్నారా ?" అని అడిగాను.

నా మాట పూర్తికాక మునుపే 'ఏమయిందిరా ?' అంటూ బయటినుండి ఎవరో కేక వేశారు–

"ఆఁ వస్తున్నా" అంటూ మంచంపై నుండి లేచాడు.

"ఏం, అంత త్వరగా పోవాలా ?"

"ఈవైపు మమ్ముల రానివ్వరు సార్, ఈరోజు జెండా వందనం కదా. అందుకే జైల్లో లడ్డూలు చేశారు. సంవత్సరం పొడుగునా తిండి సరిగా పెట్టకపోయినా, ఈ జెండా వందనం నాడు మాత్రం తలా ఒక లడ్డూ ఇస్తారు. ఇక్కడి ఖైదీలకు ఇచ్చిపోయేందుకు వచ్చిన– ఇక్కడ ఆలస్యమైతే మమ్ముల 'గంజ్'ల వేసి కొడ్తరు. వీలు చూసుకొని ఇంకెప్పుడన్న వస్త"– గుక్క తిప్పుకోకుండ గబగబ అని బయటికి పోయాడు.

"ఇగో జన్నయ్యా" ఎల్లయ్య పిలిచాడు.

ఎల్లయ్య మా తోటి డిటెన్యూ.

ఆ పిలుపుకు అతను ఆగగానే "మధ్యాహ్నం ఈ బేరక్ కాడికి వచ్చి నా పేరు ఆ కాపలా జమేదారుతో చెప్పు- వాడు రానిస్తడు" ఎల్లయ్య అన్నాడు.

'ఊఁ' అంటూ నావైపు చూస్తూ గబగబా వెళ్ళిపోయాడు.

ఇతన్ని పదహారవ ఏట, ఏదో కేసు పెట్టి, జైల్లో వేస్తే ఇప్పుడు ఓటు హక్కు సంపాదించుకున్నాడు. వయసు చిన్నదైనా అనుభవం పెద్దది. పోలీసులు పెట్టిన ఒక్కొక్క చిత్రహింస అతని వయసులో ఒక్కొక్క గ్రీష్మాన్ని పెంచింది. ఏ విషయమైనా స్పష్టంగా మాట్లాడే స్వభావం.

"జన్నయ్యకూ మీకూ పరిచయం ఎట్లా కలిగింది?" మా బారెక్‌లో ఒకరు ప్రశ్నించారు.

"ఇంతకు పూర్వం నేను వీరి గ్రామంలో పని చేశాను. ఆ గ్రామస్తులు చాలా మంది బీదవారు. నిరక్షరాస్యులు. వారందరూ అక్కడి భూస్వాముల పొలాల్లో కూలీలుగా పనిచేస్తారు. కొందరు బండ కొడుతారు. మరికొందరు రిక్షా తొక్కుతారు. వారి పిల్లలు కేవలం పాఠశాలలో పెట్టే మధ్యాహ్నపు భోజనం కోసం పాఠశాలకు వస్తారు. వాళ్ళే కొందరు యువకులైన కూలీ పనివారు చదువుకోవాలని తహతహలాడేవారు- వారందరినీ చేరదీసి ఒక రాత్రి పాఠశాల ఏర్పాటు చేశాను- అందులో ఇతడు ఒక విద్యార్థి."

మధ్యాహ్నం ఒకటయింది.

వంట హాల్లో గంట మోగింది.

కాపలా జమేదార్ ఎల్లయ్యను చూసి నమస్కారం చేశాడు- అతని పక్క జన్నయ్య ఉన్నాడు- ఎల్లయ్య వారిద్దరినీ భోజనాల గదికి తీసుకవచ్చాడు. భోజనాలు అయినాక బారెక్స్‌కు వెళ్ళాము. జన్నయ్య నాతో వచ్చాడు.

"ఎందుకు జైలుకు వచ్చావు? ఏం జరిగిందో చెప్పు" అతన్ని గూర్చి అన్ని విషయాలు త్వరగా తెలుసుకోవాలనే కుతూహలంతో ప్రశ్నించాను.

"రెండేండ్ల కింద" జన్నయ్య తన కథ మొదలుపెట్టాడు- "తుఫాను వల్ల కావచ్చు ఒకటే ముసురు- ఆరోజు సవార్లు దొరుకుడే కష్టమయింది. ఎంత ఇబ్బంది పడ్డా రెండు రూపాలకంటె ఎక్కువ సంపాయించలేక పోయాను- ఎంత బతిమిలాడినా

రిక్షా సేటు ఆరోజు కిరాయి ఇవ్వండే ఒప్పుకోలేదు- విధిలేక ఆరోజు కిరాయి రూపాయిన్నర ఇచ్చి అక్కడి నుంచి వెళ్ళబోయాను- మాసేటు పక్కనున్న డబ్బా చూపుతూ రాబోయే గోయింద్రాల పండుగనాటి దేవుని ఖర్చుకై తలా రూపాయి చందా వేయాలనీ రిక్షా వర్కర్సు అందరూ అలాగే చేస్తున్నారనీ చెప్పాడు- నావద్ద అర్ధరూపాయి మాత్రమే ఉందనీ, నేను ఇవ్వలేననీ ఎంత గీమాలినా తప్పక ఇవ్వాలనీ బలవంతం చేశాడు.

"చందాకు బలవంతమేంది? ఇవ్వనంటె వాడేం చేస్తడు?"

పక్కనున్న రాజయ్య మధ్యలో ప్రశ్నించాడు-

రాజయ్య కాలేజి స్టూడెంట్. రెండేండ్ల కింద ఒకనాడు పోలీసులు ఒక అమ్మాయిని బలవంతం చేస్తూ ఉంటే వాంతో దెబ్బలాడి ఆ అమ్మాయిని క్షేమంగా యింటికి పంపించాడు. అదనుచూచి ఎమర్జెన్సీలో 'మీసా' కింద లోపల తోసేశారు.

"చందా ఇవ్వనంటే మరునాటి నుండి రిక్షా ఇవ్వనంటాడు" జన్నయ్య జవాబు.

"వానిమీద అధార పడటమేంది? ఏదైన బ్యాంక్‌నుండి అప్పుతీసుకొని రిక్షా కొనుక్కోక పోయావా?" తిరిగి రాజయ్యే ప్రశ్నించాడు.

"బ్యాంక్‌నుండి అప్పంటే మాటలుకాదు సార్. దానికి పెద్దపైరవీ. కనీసం రెండు మూడు వందలరూపాయలు ఖర్చు అయితవి. తీరాఇంతచేస్తే జమానతు కావాలంటరు.

"కాలుకుపెడితే మెడకు, మెడకుపెడితే కాలుకుపెడతరు. వీటికిఏగలేక రోజుకి రాయేనయమనిపిస్తుంది. మాపేరుమీద ఆరిక్షాసేట్లే బ్యాంక్‌నుండి అప్పు తీసుకుంటరు." జన్నయ్య చెబుతూ పోతున్నాడు. "చివరకు మిగిలిన అర్ధరూపాయి ఆడబ్బాలో పడవేశాను మిగిలిన అర్ధరూపాయి రేపుఅందులో వేయమని మా సేట్ చెప్పే మాటలు విన్నప్పుడు నాకు ఒళ్లుమండింది. పేదవానికోపం పెదవికి చేటు అనుకొని ఇంటిమొగం పట్టాను. పది రోజుల్నుండి జ్వరంతో బాధపడి ఇప్పుడిప్పుడే కోలుకుంటున్న నాభార్య, నిన్నటి నుండి జ్వరంతో మాబుజ్జి గుర్తుకువచ్చిండ్లు. నిన్నటినుండి మందులేదు. డాక్టర్ దగ్గరకు పోవాలంటే డబ్బుకావాలి. మాబుజ్జి ఎలావుందో ఏమో.... నిన్నటినుండి ఉపవాసమే. కొంచెం జొన్నలో, నూకలో కొంటేతప్ప ఈరాత్రికి, రేపు పొద్దుటికి వెళ్ళదు. జేబులో పైసాలేదు. ఇట్లా అనుకుంటూ నడుస్తున్నా. దారిలో మిఠాయికొట్టు ముందరికి రాగానే ఏక్‌దం ఆగిపోయాను. అనుకోకుండా నాచేయి జేబులోకి పోయింది. మాబుజ్జికి రోజూ సాయంకాలం పదిహేను పైసల బూంది తీసుకపోయేవాణ్ణి. ఈరోజు ఆపదిహేను పైస

లన్నా లేనందుకు మనసు బాధగావుంది. ఆ కొట్టోడు ఉద్దెర ఇవ్వడు. బాధతో నన్నునేను తిట్టుకుంటూ ఇంటికివస్తున్నా.

"అరే, జన్నా!" అంటూ కోమటికేక వేసిండు. సడెన్ బ్రేక్ వేసినట్లు ఆగి పోయాను. "ఇయ్యాలట్ల కడకడకు దాక్కుంట బోతాన వేందిరో! బాకి సంగతి ఏమైందిరా!" అంటూ పిలిచిండు ఆరోజు పరిస్థితి అంతాచెప్పి పిల్లలకు జ్వరంవచ్చింది, నిన్నటినుండి తిండిలేదు- కిలో నూకలియ్యమని బతిమిలాడిన.

"మీకు అప్పుపెట్టుదే బుద్ధితక్కువరా- మాదిగమాట నీల్లమూట- మీరిట్ల అవద్ద మాడుతరు కాబట్టేమీకు బరకతుండదిరా- ఇదువరకిచ్చినై ముడ్డికింద పెట్టుకొని మల్ల నూకలియ్యంటానవ్- వాటికి ఇవి వడ్డారా అడిగేతందుకు సిగ్గయిన ఉండాలి- ఛో ఛో!" అంటూ కసిరిండు.

ఒక కిలోనూకలు ఉద్దెర ఇవ్వమని ఎంత కాల్లావేల్లా పడ్డా ఇవ్వనంటే ఇవ్వ నన్నాడు- చేసేదిలేక ముందుకు అడుగేసిన- "అరే" అంటూ తిరిగి కేకవేసిండు.

"ఎవలకు ఎనుకముందు చేసిన ఎల్తది గాని, షావుకారికి ఎనుకముందు చేస్తే నీ కంచాల కెల్లస్తదిరా! నీకు చేతికి ఇయ్యబుద్ది కాకుంటె కిందపారెయ్- రేపు ఈపాటికి నాబాకీ ఇయ్యవో మర్యాద దక్కదు- లంజాకొడుక" అనితిట్టి దుకానం పనిలో మునిగి పోయాడు- ఈరోజు ఈగండం తప్పించుకొని ఇల్లుచేరాను- ఎదురుగా వచ్చే మాబుజ్జికిబదులు నాకోసం కాచుక కూచున్న కాంపౌండరూ గిదిగిరి చిట్టాయనా ఎదురయినప్పుడు నాకు ఆశ్చర్యం వేయలేదు.

ఆరోజు నా పరిస్తితి చెప్పి రేపు వారికీ తప్పక ఇస్తానని బతిలాడాను.

"అరె జన్నా! అయ్యవ్వ సచ్చి పతార ఉండాలంటర్రా- శరబోయైన అన్న వాయిదకు ఇచ్చి మాట నిలబెట్టుకోవాల్రా- ఎవర్కైన బాకీ ఆపచ్చు గాని మాకు ఆప వచ్చారా? మాట పాబంది లేకుంటె మరి పూటకు చేతుల ఉచ్చున్న పోయర్రా" నోటికి వచ్చినట్లు అంటూ గిరిగిరి చిట్టాయన వెల్లిపోయిండు

"అరే, నీ పెండ్లాం సచ్చేది బతికింది- డాక్టరు ఎన్నో ఖరీదైన మందు లిచ్చిండు- అసలు ఎప్పటి పైసలు అప్పుడు తీసుకునేదే- ఏదో గరీబోడవని రెండొద్దు లాగుతె, ఇంక రెండొద్దులంటివి- రెండొద్దులు పోయి ఇప్పటికి పదాయె- నీ పెండ్లాం లేచి ఇటుఅటు తిరుగబట్టె. మా పైకం ఇంక రాకపాయె- ఎటొంటోల్లకైన వాయిదా పెట్టొచ్చు కాని డాక్టరుకు వాయిదా పెట్టొచ్చా? మరోసారి రోగం వస్తే

ఏముఖం పెట్టుకొని వస్తవు? న్యాయం ఉండాల్రా. ఈ లోకంమీద న్యాయం పుట్టి కల్సింది గాబట్టే ఓ దిక్కు కాలంగాక సత్తంటె, మరో దిక్కు వరుదలొచ్చి కొట్టుక పోతాండ్లు. సరెగాని మా పైసలు ఎప్పుడిస్తవో ఖచ్చితంగా చెప్పు" అంటూ ఆ కాంపౌండరు పట్టుబట్టాడు.

తప్పక రెండు రోజుల్లో ఇస్తానని చెప్పాను.

"మేము నీ వన్నట్లు రెండు లోజులాగుతము కాని మా కిచ్చినోడు లగుతాడా? మేము మీ తరాగ బొంకుతె వాడు మా పెండ్లాల...." అని బండబూతులు తిడుతూ, "ఎల్లుండి ఇవ్వక పోతే చూస్కో" అంటూ వెళ్లిపోయాడు.

"ఇది మాకు మామూలే రోజూ నాకు ఎదురుగా వచ్చే మా బుజ్జి ఇప్పుడెట్లుందో కడుపకాడ నిల్చుని నా భార్య ఏడుస్తూ కనపడింది.

"బుజ్జి ఎట్లుంది?" అని అడిగిన.

"అరే, డిప్టీ జైలర్ వస్తాండు" అంటూ వార్డర్ పరుగున వచ్చి చెప్పాడు.

పోలీసు కాన్సెంట్రేషన్ క్యాంపుకు కొత్తగా పట్టి తేబడిన వానిలా జన్నయ్య వొణికిపోయాడు.

"ఈ మంచాల పండుకొని నిండ దుప్పటి కప్పుకో" ఆ వార్డరే సలహా ఇచ్చాడు.

మరుక్షణంలో జన్నయ్య అలాగే చేశాడు.

ఆ డిప్టీ జైలర్ ఒకసారి అన్ని బారెక్స్ చుట్టిపోయాడు.

మధ్యమధ్యన డిప్టీ జైలర్లు అలా వచ్చి పోవడం ఈ జైల్లో పరిపాటి.

"అరె, జన్నా! ఇంక ఎంతసేపుంటవు బే" అంటూ జమేదారు బారెక్ లోపలికి వచ్చాడు.

కొద్దిలో తప్పిపోయిన ప్రమాదం నుండి తేరుకున్న వాడిలా జన్నయ్య వొణుకుతూ మంచం నుండి లేచాడు.

ఆ జమేదారు జన్నయ్య వైపు ఉరిమి చూశాడు.

"పోతాన సార్" అంటూ జన్నయ్య కదిలాడు.

"ఇంకొద్దిసేపుంటె నీకేమయితాంది?" రాజయ్య కరుకుగా జమేదారును మందలించాడు.

"ఇప్పటోడు చూస్తే మాకు రిమార్కు వస్తది సార్. టీ వేలకు పంపిస్తా" అంటూ నసుగుతూ బయటికి వెళ్ళాడు

ఈ మాటల సందర్భంలో జన్నయ్య ఎప్పుడు జారుకున్నాడో।

"ఈ లంజా కొడుకులకు రిమార్కొస్తదట. చేసేవన్నీ ఎదవ పనులు. చెప్పేవి నీతి సూత్రాలు" మా వార్డుకు వార్డర్‌గా ఉన్న చంద్రం అన్నాడు.

చంద్రం ఏదో టైర్ల ఫ్యాక్టరీలో వర్కర్. తమ న్యాయమైన హక్కులకోసం యాజమాన్యానికి వ్యతిరేకంగా జరిగిన సమ్మెకు నాయకత్వం వహించాడని పని నుండి తొలగించారు. అయినా కార్మికులు సమ్మె ఆపలేదు. దాంతో పిచ్చెక్కిన యాజమాన్యం గుండాలతో నాయకుల ఇళ్ళపై దాడి జరిపించారు. ఫలితంగా ఎందరో గాయపడ్డారు. చంద్రం భార్య, బిడ్డలు ఆ దొమ్మిలో చనిపోయారు. కార్మికులు రెచ్చిపోయి యజమాని యింటిమీద దాడిజేశారు. ఆ దాడిలో యజమాని చచ్చిపోయాడు. ఈ కేసులో చంద్రానికి యావజ్జీవ శిక్ష పడింది.

"జైల్లో, యీ జమేదార్లకి ఖైదీలను ముంచే అవకాశం ఏముంటుంది?" నేనే ప్రశ్నించాను.

చంద్రం చిన్నగా నవ్వాడు.

"ఖైదీలలో చాలా మంది ఏదో ఒక అలవాటుకు బానిసైపోతారు. ఆ అలవాట్లు తీర్చుకోవాలంటె ఈ జైలు సిబ్బంది ద్వారానే సాధ్యమవుతుంది. అప్పుడప్పుడు ఖైదీలకు ఇండ్ల నుండి వచ్చే డబ్బుతో వారికి కావలసినవి తెచ్చి పెడతారు."

"ఏమేమి తెస్తారేమిటి?"

"పొగాకు, గంజాయి, సారా, పత్తాలు యిలాటి వేవైనా తెస్తారు. కాని రూపాయి సొమ్ముకు నాలుగు రూపాయలు రాబడుతారు. అంతేకాదు కొందరు ఖైదీల వద్ద డబ్బు లేకుంటె వారి చొక్కాలు, పేంట్లు తీసుకొని రెండుమూడు బీడీల కట్టలిస్తారు."

"అవన్నీ చూస్తూ అధికారులు ఎలా సహిస్తున్నారు?"

"వాళ్ళు పెద్ద దొంగలు స్సార్. వాళ్ళు చేయని యెదవ పనంటూ ఉండదు. జైలు కార్ఖానా నుండి బోలెడు వస్తువులు కాజేస్తారు. ఖైదీల రేషన్ నుండి సరేసరి. ఇందులో పైనుండి కింది అధికారిదాకా వాటాలుంటాయి. ఖైదీల తిండి ఎంత అధ్వాన్నంగా ఉంటుందో చెప్పలేము. రాళ్ళూ పురుగులూ అబ్బబ్బ! అసహ్యం."

"మీకు ఇచ్చే అహారాన్ని డాక్టర్ పరీక్ష చేయరా?"

మా చుట్టూ కూచున్న వాళ్ళందరూ గొల్లుమన్నారు.

"ఎంత అమాయకులు సార్ మీరు. వాడుకూడా ఈ జైలు సిబ్బందిలో ఒకడే కదా! వాని వాటా వాడికి ముట్టినాక, ఖైదీలతో, వారి ఆరోగ్యంతో వాడికేంపని?"

"ఈ జైలు సిబ్బంది మిమ్మల్ల అంత దారుణంగా చూస్తుంటే మీరంతా ఒకటై దానికి నిరసన తెలియజేయవచ్చు కదా?"

"మాకు ఆహారం సరిగా ఇవ్వటంలేదని ఒకసారి పదిమందిమి నిరాహారదీక్ష పట్టినం. అందుకు జైలు అధికార్లు మండిపడి మా అందరి చొక్కాలు ఊడదీసి చితుగ్గొట్టి గంజిలో వేశారు, అయినా మా పట్టుదల సడలలేదు. ఎనిమిదవ నాటికి మాలో కొందరు చాలా నీరసపడిపోయారు. విషయాన్ని గ్రహించిన అధికార్లు డాక్టరుతో వచ్చి బలవంతంగా నోళ్ళలో ఇనుపకడ్డీలు పెట్టి పాలు పోశారు. ఈ రకంగా ప్రాణాలు పోకుండా చేశారు. మా విషయాలు పట్టించుకునేవారు బయట ఎవరూలేరు. అందుకే యిక ఫలితం లేదని విధిలేక నిరాహారదీక్ష విరమించుకున్నాం."

చంద్రం తన యావజ్జీవ జైలుశిక్ష అనుభవాల పుటలు చదువుతున్నాడు.

"వీరి పై అధికార్లు జైలును ఎప్పుడూ తనిఖీ చేయరా?"

"వాళ్ళు గజదొంగలుసార్. వాళ్ళు రాంగానే ఘనంగా పార్టీలు ఏర్పాటుచేసి, వారి వాటా వారికి ముట్టచెప్పుతరు. అంతే, ఖైదీల విషయం ఎవడూ పట్టించుకోడు. అయినా వాళ్ళు ఇన్‌స్పెక్షన్‌కు వచ్చేది ఖైదీల బాగోగులు విచారించేందుకు కాదు. వారి వాటాలు తీసుకపోయేందుకు...."

చంద్రం చెపుతూ పోతున్నాడు.

"డాక్టరొచ్చిండు" జవాను మా వద్దకు వచ్చి చెప్పాడు.

వారాని కొకసారి డాక్టర్ వార్డ్సులోకి తన అట్టహాసంతో వచ్చి పోతుంటాడు. వారి కుర్చీలు, టేబుల్సు మోసేందుకు నలుగురు మనుషులు. వారు తెచ్చే మందుల ట్రే మోసేందుకు ఒకరు. ఇదీ వారి హంగామా.

రోగాలన్నిటినీ డాక్టరుగారు తమ ప్రావీణ్యంతో రెండు మూడు గ్రూపులుగా విభజించినట్లున్నారు. ఏ రోగానికైనా రెండు మూడు రకాల టాబ్లెట్లనే ఇచ్చి తమ వంతు పని పూర్తిచేసుకొని వెళ్ళిపోతారు. అందుకే చాలా మంది డిటెన్యూలు డాక్టరు వద్దకు వెళ్ళరు.

డాక్టర్ ఆ వారం పని పూర్తిచేసుక వెళ్ళిపోయాడు.

'టీ' వేళకు గంట మోగింది. జన్నయ్య మళ్ళీ వచ్చాడు.

"అన్నట్లు జన్నయ్యా, నీ బిడ్డ సంగతి చెప్పుతున్నావు కదా."

తన కథ మొదలుపెట్టాడు జన్నయ్య.

"బుజ్జి ఎట్లుందని అడిగానే కాని నా భార్య సమాధానం వినకుండానే ఇంట్లోకి పోయాను. గుడ్డిదీపం వెలుతురులో చినిగిన చాపలో శవంలా పడివుంది బుజ్జి. ఒక రోజంతా పూర్తిగా తిండిలేదు— మందులేదు— పక్క ఇంటినుండి కాస్త గంజి అడిగి తెమ్మని నా భార్యతో చెప్పాను "

ఇంతకు ముందే ఎక్కడ తిరిగినా గంజి దొరుకలేదని చెప్పింది.

"బాకీ కట్టంది దుకానవోడు సూకలియ్యడు— డాక్టర్ మందివ్వడు— ఎటూతోచని స్థితి. ఏమి చేయాలో అర్థం కావటంలేదు."

"సర్కారు దవాఖానాకు తీసుకపోకపోయినవా ?" మాలో ఎవరో ప్రశ్నించారు.

"ప్రైవేట్ దవాఖానలో అయితె ఒక్క డాక్టరుకే ఫీజు ఇచ్చుకోవాలి. సర్కారు దవాఖానలో కింది నుండి పైదాక ముడుపులు చెల్లించుకోవాలి— 'సర్కారు దవాఖాన'." మూడుఏళ్ళ క్రితం అక్కడి డాక్టర్ల నర్సుల నిర్లక్ష్యానికి తన రెండేండ్ల కొడుకు బలైపోయిన భయంకరమైన అనుభవం జ్ఞాపకానికి వచ్చి అతని ఒళ్ళు జలదరించింది.

"మా బుజ్జికి జ్వరంలోనే కింకలు వచ్చినట్లున్నవి— కళ్ళు అదోలా తిప్పుతున్నది— మెడలు ఎగురవేస్తున్నది— పండ్లు బిగపట్టింది— నోటి నుండి సొల్లు వస్తున్నది— చూస్తూ ఊర్కోలేక మా బుజ్జిని తీసుకొని మా ఊరి ప్రైవేటు డాక్టరువద్దకుపోయాను.

నన్ను సూసే సూసుడే మండిపడ్డడు— ఎంత కాల్ల మేల్ల పడ్డా పైసలివ్వంది మందు ఇవ్వనని కరాకండిగా చెప్పిండు.

మా బుజ్జిస్థితికి బాధ, వాడు మందు ఇవ్వనన్నందుకు కోపం, నా చేతగానితనానికి నాపైనాకే అసహ్యం ఒక్కసారి నా మనసులో మెదులగా ఇంటికి చేరుకున్నాను.

"సూది ఇప్పించావా" అంటూ నా భార్య ఎదురయింది.

ఎదురయిన నా భార్యకు బుజ్జిని అందిచ్చిన—

కారు చీకటి— ఆకాశంలో ఒక్క చుక్క గూడ లేదు. బయటికి నడిచాను— ఎంత దూరం పోయానో ఏమో.... మెరుపు మెరిసింది— దూరంనుండి ఎవరో సైకిలు మీద వస్తున్నారు— నేను రోడ్డుపై ఉన్నట్లు గుర్తించాను— ఉరుము ఉరిమింది— మెదడు పనిచేయడం మొదలుపెట్టింది— మెరుపు మెరిసింది— సైకిలు దగ్గరయింది— ఒక్కపాటున సైకిలుమీద పోయేటాయనను కిందికి లాగిన— అతన్ని గట్టిగా పట్టుకొని డబ్బు ఇయ్యమని అడిగిన— అతను ఏదో అనబోయిండు— అతని మాటకు ఎదిరిచూడకుంటనే అతని జేబులు వెదికిన.

అతని జేబులో దొరికిన పాకిటు తీసుకొని ఇంటిదిక్కు పరిగెత్తిన-

"ఎలాగైన మా బుజ్జిని బతికించుకోవాలి- అదొక్కటే నా కోర్కె-"

"ఎంత తొందరగ మా యింటికి పరిగెత్తిన్నో, అంత కటుక్కున ఆగిపోయిన."

"చీకటిలో మా యింటి ముందట ఎవరో దీపం పెట్టిన్రు- తల బాదుకుంట ఏడ్చే నా భార్య, చుట్టూ మూగిన జనం మధ్యన మా బుజ్జి శవం- ఒక్కసారిగా మా బుజ్జిపై బడ్డాను- ఎంతసేపున్ననో।"

"ఎవరో వచ్చి ఎనుక నుండి నన్ను తట్టి లేపిన్రు- తీరా చూసేసరికి పోలీసులు, వాళ్ల పక్కన గిరగిరి చిట్టీ యజమాని."

కళ్ళ నుండి ఏకధారగా వచ్చే కన్నీటిని చొక్కాతో తుడుచుకున్నాడు జన్నయ్య.

'ఆపై కథ మామూలె'- జన్నయ్య తిరిగి మొదలు పెట్టాడు. "పోలీసుల దెబ్బలు, చిత్రహింసలు- అంతేకాదు వాళ్ళు నన్ను మరో రెండు దొంగతనాలు చేసినట్లు ఒప్పుకొమ్మన్నారు- అందుకు వినకపోతే ఖూనీ కేసు పెడ్తమని బెదిరించారు- చివరకు నాకు మూడేండ్ల శిక్ష వేయించారు."

"నీ భార్య ఇపుడు ఏం చేస్తున్నది?" ఎవరో అడిగారు.

"పిచ్చిదయింది" అంటూ ఏడ్చాడు.

నాక్కూడా కన్నీళ్ళు ఆగలేదు.

"జన్నా పదరా"అంటూ జవాన్ లోనికివచ్చాడు.

"సార్, నేనువిడుదల అయినంక నాకుటుంబాన్ని నాశనంచేసిన ఆ డాక్టర్ను, గిరగిరి చిట్టోన్ని వాళ్లందర్ని ఖతంచేసి తిరిగిఇదే జైలుకువస్త- అంతవరకు నాకోపం చల్లారదు." పిడికిలిబిగించి బిగ్గరగా అన్నాడు. కండ్లు ఎరుపెక్కాయి.

"జన్నయ్యా! ఈదేశంలో మనలాంటి లేనివారు చాలామంది ఉన్నారు. ప్రతి వ్యక్తీ ఏదోరకంగా ఉన్నవారి దోపిడికి గురిఅవుతూ, అనేకరకాల బాధలకు బలిఅవుతూనే ఉన్నాడు లేనివాడు. ఒంటరిగా ఏమీచేయలేడు. నీవన్నట్లు ఆ డాక్టర్, గిరగిరి చిట్టీ యజమానిలాంటి వారిని నీవు ఖతంచేసి సాధించేది ఏమీలేదు- వారుపోతె వారి స్థానంలో కోకొల్లలు. కాబట్టి లేనివారందరు ఒకటై ఉన్నవాడికి వ్యతిరేకంగా పోరాడి యీ దోపిడి వ్యవస్థను రూపుమాపాలి."

నామాటలు వింటూ జన్నయ్య చీకటిలో తన బారెక్స్‌వైపు నడిచాడు ఆకాశంలో నక్షత్రాల వంక చూస్తూ.

*

(ఇటీవల వరంగల్ సెంట్రల్ జైల్లో జైలుఅధికార్ల దౌర్జన్యానికీ, అత్యాచారాలకూ వ్యతిరేకంగా సామూహికంగా పోరాడిన ఖైదీలందరికీ యీకథ అంకితం.)

## చావుకూడ బతుకుకంటె విలువైన త్యాగంగా.... కథపై చర్చ:

బొట్టు, గాజులు, మట్టెలు పెట్టుకోవటం, తీసేయటం, మంగళసూత్రం కట్టుకోవటము - తెంపేయటమూనూ ఫ్యూడల్ సంస్కృతిలో ఒక అంశంగా శాస్త్రీయ దృక్పథం కలిగినవారు ఎవరైనా గుర్తించాల్సిన విషయం. అట్టి అశాస్త్రీయమైన, ఫ్యూడల్ సంస్కృతిలో ఒకఅంశమైన కుంకుమబొట్టును తుడిచెయ్యటం అప్రయత్నంగా కాకుండా (అట్లాచెప్పినా అదితప్పే) ఉద్దేశ్యపూర్వకంగానే కిరణ్‌గారు 'చావుకూడా బతుకుకంటె విలువైన త్యాగంగా' అన్నకథలో వ్రాయటంజరిగింది. ఒక విప్లవకారుడు చనిపోయినతర్వాత అతడు చనిపోయినాడని తెలియజేసే విధానముగా అతని భార్య కుంకుంబొట్టును తుడ్చేయటం ఈకథలో మనంచూడవచ్చును. "నుదుట ఎర్రగా సూర్యునిలాగా మండుతున్న అగ్నిగోళంలాంటి కుంకుంబొట్టును తుడిచేశాను" అని అది దేనితోపోల్చినా దానివెనుకనున్న ఫ్యూడల్ (తద్వారా ఆరచయితయొక్క) స్వభావాన్ని ఎవ్వరూ మరుగుపరచజాలరు. చనిపోయిన అవిప్లవకారుడి చివరిమాటల్ని గమనించండి. "ఈసంగతి రుక్మిణికిచెప్పు- ఘోరున ఏడుస్తూకాదుసుమా। సహజమైన విషయంలాగా చెప్పాలె- సెంటిమెంటనుకునేవు...." ఆవిప్లవ అమరుని మాటలు గడ్డోకలిపి ఈయన గారు ఆ విప్లవకారుడి కుటుంబానికి మరణవార్త అందించినవిధం పైన చూశాము కదా! ఒకపాఠకుడిగా నా ఈవిమర్శ కిరణ్‌గారు సహృదయంతో స్వీకరిస్తారని ఆశిస్తూ-

— పర్వత్
హైదాబాద్

జూన్ 2, 78

## బొట్టు అలంకారమా, మొగుడి ప్రాణమా?

ప్రకాశ్ రాత్రివేళ అడవిలోంచి పోవాల్సివచ్చినపుడు అక్కడ "ఆయుధాలు ధరించిన మృగాలుంటాయని" అనుకుంటాడు- ఇక్కడ విషలీకరణ లోపభూయిష్టంగావుంది- అడవుల్లో ఆయుధాలు ధరించి ఆశయసిద్ధికోసం పోరాడే అన్నయ్యలూ వున్నారు- ఈదోపిడీ సమాజపు కాపలి కుక్కలుకూడా ఆయుధాలు ధరించి తిరుగుతున్నాయి. ఈరకమైన వివరణలేకుంటే, ఆయుధాలు ధరించిన అందరూ మృగాలుగానే అర్థంఅవుతుంది.

ఇకపోతే! రుక్మిణికిభర్త చనిపోయిన సంగతి తెలియజేయడానికి ఎర్రగా సూర్యునిలా వెలిగిపోతున్న ఆమె నుదుటి కుంకుమబొట్టు తుడిచేస్తాడు- ఈ ఉపమానమూ, వ్యక్తీకరణ చాలా పేలవంగానూ, కులమత తత్వాలకు, మూఢాచారాలకు, ప్రతీకగానూ వుంది. ప్రజాతంత్రి శ్రామిక, కార్మికరాజ్యంకోసం ప్రాణాలు అర్పించినవాడు అమ

## "విరసం ఎలా వుంది? ఎలా వుండాలి?"



1) తెలంగాణా పోరాట కాలంలో ఆ తర్వాత కొంతకాలం అరసం చెప్పుకో దగిన సాహిత్యసేవే చేసింది. ఆ పోరాట రూపాల్నీ, ఆ వాస్తవిక స్థితిగతుల్నీ, ప్రజా చైతన్యాన్నీ ఆసరాగా ఊతగా తీసుకొని ఎన్నో అభ్యుదయకరమైన రచనలు వెల్వడ్డాయి. ఆ తర్వాత అరసం క్రమేణా విశ్వనాథ వగైరా కవులను ఆహ్వానించేంత 'అభ్యుదయ' స్థితికి ఎదిగింది. అప్పటికే అరసంలో ఊపిరి పీల్చుకోవడానికి ఇబ్బంది పడ్తున్న శక్తులన్నీ ఒక్కటిగా చేరాయి. రానురానూ అరసం పాలకవర్గ పాక్షిక ధోరణులతో మిలాఖత్ కావటమూ, సంస్కరణ వాదపు ఊబిలో కూరుకుపోవటమూ బహిరంగంగా జరిగే సరికి అప్పటికే ఈ ఒంటెత్తు పోకడను నిరాకరించి, ప్రజా సాహిత్య సంస్కృతీ పరిరక్షణకు తిలోదకాలిచ్చిన అరసం నుండి చీలివచ్చిన విప్లవకర శక్తులే విరసంగా ఒక వేదికమీద నిలబడ్డాయి. వారి సాహిత్యానికి అప్పటి నక్సల్‌బరీ, శ్రీకాకుళ పోరాటాలు ఊపిరిగా నిలిచాయి. అరసం విడివడి ఒక సరికొత్త సంస్థగా విరసం మొగ్గ తొడగడం యాదృచ్ఛికమూ తాత్కాలికమూ కాదు. (ఎన్నోసార్లు తమ భావాలు ఈ రచయితలచే ప్రకటింపబడ్డాయి.) అది చాలా సహజంగా జరిగింది. పురిటి నొప్పులు పడిన తర్వాత ప్రసవం జరిగినట్లే విరసం ఏర్పడింది.

2) అరసం నుండి నిజమయిన అభ్యుదయకర రచయితలు విడివడి విరసం వేదికలో నిలబడ్డారనే చెప్పాలి. ఆ తర్వాత కొంతకాలం వరకూ విరసం సాహిత్య జీవితం కొనసాగినా త్వరలోనే తన ధోరణిని బయటపరచుకుంది. హింసా ధోరణిని

---

రుడు- అతనికి చావులేదు- ఈమధ్యన ఒకహిందీ రచయితచెప్పాడు- (ఆచారాలమీద విశ్వాసాలువున్నవాడు కూడాను-) దేశంకోసం ప్రాణాలర్పించాడని, ఆయన ఎల్లప్పుడూ జీవించే వుంటాడని, అతనిభార్య తనబొట్టును అందుకు గర్వంగా వుంచుకుంటుంది. మరొకతెమె తనభర్త ప్రజాద్రోహిగా బ్రతుకు సాగిస్తున్నాడు- అతను జీవించివున్నా చచ్చినవానితో సమానమని తన బొట్టును చెరిపివేసుకుంటుంది- మరి ఈ కథలో ప్రజా పోరాటంలో మరణించినవాడిపట్ల ఆమాత్రం అభిమానమైనా చూపలేదు- కథ పేరులో మాత్రం అంతకంటె ఎక్కువగానే వుంది.

నాకు తెలిసివున్న కొందరు మట్టైలు మంగళసూత్రం కట్టుబొట్టు పట్టింపులులేని ఆదర్శ దంపతులు వున్నారు- అందులో ఒకామెకు బొట్టువుండదు- మరి ఆమె భర్త చనిపోయినట్లా ?

— ఎన్నారెస్
వరంగల్

జూన్ 3, 78

బట్టబయలుగా తమ రచనల్లో వ్యక్తీకరించడం, స్పష్టంగా అవగాహనలేని పాక్షిక ధోర ణినీ, అరాజక ధోరణినీ చేపట్టటం జరిగింది. మార్క్సిజం– లెనినిజం– మావో ఆలో చనా విధానంఅంటూ తనకూ తనస్వేచ్ఛకూ అడ్డుగోడలు కట్టుకుందనిపిస్తోంది. తత్ఫలి తంగానే విరసంను అభిమానించే కొందరు రచయితలు అభిమానిస్తూనే దూరంగా ఉంటూవచ్చారు. ఈ వ్యక్తిగత హింసాధోరణిని విరసం వ్యక్తీకరించడం ఫలితంగానే ప్రజల్లో తగినంతగా చొచ్చుకుపోలేక పోయారు. అదీకాక మార్క్సిస్టు– లెనినిస్టులలో గ్రూపులు వచ్చినట్లుగానే విరసంలోకూడా ఆగ్రూపు మనస్తత్వాలు అంకురించి బల పడడం జరిగింది. విరసంను సంస్థాపరంగా పరిరక్షించే ధోరణి విడిచిపెట్టి ఎవరి గ్రూపునువారు బలపరుచుకొంటూ సభల్లో సమావేశాల్లో కీచులాడుకొంటూ సంస్థగుట్టును రచ్చకీడ్చారు. అంతేకాదు ఇతర అభ్యుదయకర రచయితలకు విరసంలో ప్రవేశం లేకుండా తమ పాక్షిక ధోరణులవల్ల చేశారు.

3) ఈ గ్రూపు రాజకీయాలవల్ల, సంఘీభావం లేని బాధ్యతా రాహిత్యం వల్లా విరసం కార్యకలాపాలు ఎమర్జెన్సీలో దాదాపు పూర్తిగా స్తంభించాయి. అక్కడే తమ లోపాయికారి తనం బయట పడింది. రావి శాస్త్రి, శ్రీ శ్రీ వంటివాళ్ళు బహిష్కరించ బడటం, వాళ్ళు తమలోపాల్ని దాచుకొంటూ పశ్చాత్తాపం ప్రకటించక పోవటం– ఎవ రైతే 'అభ్యుదయ' రచయితలని ప్రజలూ అభిమానులూ భావించి నమ్మేరో వాళ్ళే సంస్థకు ద్రోహంచేసి తిరోగమించటం జరిగింది. అంతేకాదు విరసం సభ్యులందరూ (బాధ్యత కలవారు) పూర్తిగా అరెస్టు కావటంవల్ల విరసం జైళ్ళో ఉండిపోయింది. అంటే కనీసం యు.జి లోఉండే సామర్థ్యం వీరికిలేదనీ ప్రజల్లో వీరు కలిసిపోయి వాళ్ళ సానుభూతిని పొందటంలేదనీ తెలుస్తోంది. అంతేకాకుండా ప్రజల మద్దతు అంతగాలేని వీళ్ళని అందిన వార్నందర్నీ జైళ్ళలో తోసేసింది. ఎప్పుడైతే విరసం తన కార్యకలాపాల్ని కొనసాగించాలో అప్పుడే మూలపడింది. ప్రజలకు తమమద్దతును విరసం ఎప్పుడైతేయిచ్చి ప్రభుత్వపు వైఖరి బయటపెట్టాలో అప్పుడే అదివిఫలమైంది. ఫలితమే విరసం బలహీనమైపోవటం, చీలటం, (రాజకీయాలు ముదిరి రచ్చకెక్కి) స్తబ్దుగా ఉండటం–

4) ఎమెర్జెన్సీ తర్వాత కొంతకాలంవరకు విరసం చితికిపోయిన తన నడుమును సవరించుకొంటూ, కొన్ని దుష్టాంగాలను ఖండించింది. కానీ ఆ అంగాలు పడిపోవటం వల్ల విరసంకొంత నీరసం అయిందనే చెప్పాలి. విరసం జైళ్ళలో జరిపిన చర్చవల్ల, కొంతతిరిగి చూచుకోవటంవల్ల వ్యక్తిగత హింసాధోరణిని కొంతవరకు అరికట్టుకో

గలిగినా గ్రూపుమనస్తత్వం పోలేదు. అది ప్రచ్ఛన్నంగా ఉందేమో! మొన్న చీరాలలో జరిగిన ఆరవ విరసం మహాసభల్లో కొన్ని నియమాల్ని పాటించినట్లు చెప్పటనే తెలుస్తోంది. మొదటవచ్చిన వినాదసాహిత్యం యిపుడు లేకపోవటంవల్ల విరసంలోని కొన్నిశక్తులకు అసంతృప్తిగాఉంటే చెప్పగలిగిందిలేదు. కానీ వాస్తవం ఆలోచిస్తే ఈ వినాదాలేనా సాహిత్యం? ఈనాటి ఎన్నో సమస్యలను తమరచనల్లో ప్రతిబింబింపచేసి ప్రజల దృష్టికి వాటిని తీసుకురావచ్చుకదా! ఇపుడు పరిస్థితి చూస్తూంటే విరసం తననుతాను ఆత్మపరిశీలన చేసుకుంటోందని పిస్తోంది.

5) విరసం విప్లవకర సాహిత్యాన్ని ప్రజా బాహుళ్యంలో ప్రచారం చేయక మునుపే అందులోని రచయితలు దిగంబర సాహిత్యంవల్ల తమ దృక్పథాన్ని నిశితంగా చూపారు. శ్రీశ్రీ వంటి రచయితలు అప్పటికే ఝంఝామారుతంగా తమ భావాల్ని రచనలద్వారా తెలుగు ప్రజల గుండెల్లో వీస్తున్నారు. సంస్థాపరంగా ఏర్పడిన తర్వాత కొంతకాలం రచనలు ప్రజలకు ఉత్తేజకరంగా, ఉత్సాహపూరితంగా ఉన్నా తర్వాత తర్వాత విరసం వినాదపూరితమైన సాహిత్యంవల్లా, గ్రూపు దృక్పథాలు, వ్యక్తిగత హింసావాదం రచనల్లో ప్రతిఫలించడంవల్లా వాళ్ళు ప్రజలకు నిజంగానే దూరమయ్యారనిపిస్తోంది. విరసం సాహిత్యానికీ సంస్కృతికీ దోహదం చేసిందా లేదా అంటే ఖచ్చితంగా దోహదం చేసిందనే చెప్పాలి. కానీ అదే సమయంలో చేయవలసినంతగా, చేయదగినంతగా చేయలేదనే చెప్పాలి.

6, 7) విరసం ఎలా ఉండాలి? విస్తృత ప్రజాస్వామ్య వేదిక కావాలన్నా పైన పేర్కొన్న లోపాల్ని తొలగించుకోవటమే పరిష్కారం. దౌర్జన్యాన్నీ, దోపిడీని నిరసించే రచయిత విప్లవ రచయిత కాకపోవచ్చు. అతనిలో మార్క్సిస్ట్ అవగాహన లేకపోవచ్చు అంతమాత్రాన అతడు అభ్యుదయ రచయిత కాకపోతాడా? అతని ఆలోచనలకు రూపం యిచ్చి అతడికి తమ మద్దతు నివ్వటం ద్వారా అతడ్ని తమలో కలుపుకోవచ్చు, తద్వారా ఎందరో రచయితలు తయారవుతారు. క్రమేణా క్లాసులు నిర్వహించో, సభలద్వారానో మార్క్సిస్టు-లెనినిస్టు సూత్రాలను వారితో చదివించి నిజమయిన విరసం రచయితగా రూపుదిద్దవచ్చు. ఎదుటి వర్గాలలోని 'మన' వర్గపు రచయితల్ని మనం మనవైపు లాక్కోవాలి. కుక్కగొడుగుల్లా పత్రికలూ వాన చినుకుల్లా రచనలూ ఉత్పత్తౌతున్న ఈ సమయంలో, రచనలు ఫలానా దృక్పథంతో ఉండాలనీ, ఫలానా విధంగా వ్రాస్తే జన బాహుళ్యానికి అర్థమై భావప్రేరక సాధనాలౌతవనీ చాలా మందికి (రచయితలకు) తెలియకపోవచ్చు. విరసం (మరే ప్రజా సాహిత్య సంస్థయినా) వాళ్ళకు దారితెన్నూ చూపించాలి.

ఈనాడు లోపించిన మార్క్సిస్టు అవగాహన, సామాజిక చైతన్యాలను ఆసరాగా తీసుకొని మృతప్రాయమయిన రాచరిక సంస్కృతిని చెత్త విలువలను ప్రచారంచేసే మృగ సంస్కృతినీ కత్తికొక కండగా చీల్చి ప్రజలముందు పెట్టగలగాలి. వాస్తవ పరి స్థితుల కనుగుణంగా సంస్థ మార్పులూ, సాహిత్య రీతుల కనుగుణంగా, జనం అభిరు చులను (వీలయితే మారుస్తూ) స్పందిస్తూ, "మీ వాళ్ళం మేము మీలోని వాళ్ళం" అనే సానుభూతిని వాళ్ళ నుండి మీరాశించాలి. సంస్థలోని వాళ్ళకి సాహిత్యంపై స్పష్టమైన అవగాహన ఉండాలి. వివిధ దేశాల సాహిత్యరీతుల్ని పరిశీలించి వర్ధమాన రచయిత లకు చెప్పగలిగే విధంగా ఉండాలి. అభ్యుదయకర సంఘాలతో ప్రత్యక్ష పరోక్ష సంబంధ ముండటం అవసరం. తమను తాము విమర్శించుకోవడం అనే ఆత్మ సంస్కారం విరసం కీనాడు అవసరం.

విరసం రచయితలు తమ పత్రిక(ల) ద్వారా, తమను బలపరిచే పత్రికలద్వారా లేక స్వంతంగానో తమ సాహిత్యాన్ని ప్రచురిస్తున్నారు. అంటే అవి (ఆ పత్రికలు సాహిత్యం) కొందరు మాత్రమే చదవడాని కవకాశముంది. వివిధ వార మాసపత్రి కల్లో కూడా వారు తమ రచనలు పంపుతే పాఠకులు తమ సాహిత్యానికి అలవాటు పడటం జరుగుతుంది. వర్ధమాన యువ రచయితల పట్ల విరసం ఆసక్తి చూపాలి. భవిష్యత్తంతా యువతరానిదే కాబట్టి, వాస్తవాన్ని ప్రేమించే నిజాయితీకల వాళ్ళుగా వార్ని రూపొందించాలి. కామ్రేడ్ మావో చెప్పినట్లు ప్రజలను మనవెంట కాకుండా ప్రజల వెనుక మనం పోగలగాలి. అపుడే విరసం ప్రజావేదిక కాగలదు.

<u>'సృజన' పాత్ర</u>: విరసంపై ఉన్న విమర్శలు ఒక రకంగా 'సృజన'కు కూడా వర్తిస్తాయి. విరసం చేసిన కార్యకలాపాలకు వంత పాడింది 'సృజన'. వారి సాహి త్యాన్ని ప్రచురించింది చాలావరకు. ఇది ఎంతగా వ్యాప్తిచెందిందంటే విరసం అనధి కార పత్రిక 'సృజన' అయ్యేంతవరకు. ఇలా ఎందుకు జరిగింది? బహూశా 'సృజన' నడిపేవాళ్ళు విరసంతో సంబంధీకులు కావటం మూలాన, విరసం భావాలు నచ్చటం మూలాన- జరిగి వుంటుంది. అందుకే విరసం ఎమర్జెన్సీలో స్థంభించగానే ఒక గురు తరమైన బాధ్యత నిర్వహించ (వలసిన) గల 'సృజన' మూతపడింది. అంతేకాదు విరసం వివాదాల, వ్యక్తిగత హింసా ధోరణినీ, 'సృజన' ప్రచురించింది. అంటే విరసంలోని ఈ అభిప్రాయాలకు 'సృజన' కూడా మద్దతిచ్చినట్లు తేలుతోంది. కాబట్టి విరసంలోని లోపాల ప్రభావం 'సృజన'లో కూడా ప్రతిఫలీకరించిందనుకుంటాను.

ఎక్కువగా అనువాదాలు మొ॥నవి వేయటం మూలాన కొంత ప్రభావాన్ని కోల్పోయే ప్రమాదముంది. కథాసాహిత్యం, వర్తమాన సాహిత్య విలువలు ప్రతి

బింబించే వ్యాసాలు, భావస్ఫోరకమూ చైతన్య స్ఫోరకమైన కవితలూ ఉండటం జరగాలి. విరసం రచయితలే కాకుండా ఏ రచయిత భావాలయినా ప్రచురించగల నిజాయితీ, స్వేచ్ఛ 'సృజన' కుండాలి. ఇది ప్రజల పత్రిక (ఒక సంస్థదికాదు) అన్న అభిప్రాయం పాఠకులకు కలగాలి. (లేకపోతే ఫలానా సంస్థది అని స్పష్టంగా ప్రకటించాలి.

పాఠకుడిగా ఈ చర్చలో వెలిబుచ్చిన అభిప్రాయాలు నా వ్యక్తిగతమైనవే.

అరుణాభినందనలు—

— నాగేశ్వరరావు, ఎ. ఎన్.
జవహర్ భారతి, కావలి.

సాహితీ మిత్రులకు—

1) ప్రభుత్వంలో లోపాల్ని చూపే రచయితలని ఒక త్రాటిపైకితెచ్చి ప్రభుత్వ నిరంకుశ విధానాల్ని మార్పుచెందిన కవితా రీతులలో ఎదురించి, ప్రజల్లోనూ సాహిత్య జగత్తులోనూ విప్లవాన్ని సృష్టించిన ఘనత విరసంకి తప్ప ఎవ్వరికీ చెందదు. ఐతే సరియైన ప్లాను లేకపోవడంచేత విరసం కొందర్ని మాత్రమే ఆకర్షించింది.

2) విరసం తొలిరోజుల్లో తన కలంలో తుపాకి గుండ్లనునింపి కేవలం హింసావాదంపై మొగ్గు చూపడంవల్ల పాఠకుల్లో కొందరు వర్గరహిత సమసమాజ స్థాపనకై చేసిన ఉద్రేకపూర్వకమైన ప్రయత్నాన్ని, లోతుగా అర్థం చేసుకోకుండా, విరసం ఒక విప్లవ రాజకీయ వ్యవస్థగా అనుకోవడానికి అవకాశమిచ్చింది.

3) తమ రచనలద్వారా విప్లవకవులను సృష్టించిన మహాకవులు, ప్రభుత్వాన్ని పొగడుతూ విప్లవ కవిత్వాన్ని అవకాశవాద కవిత్వంగా మార్చడంతో, విరసం పట్ల ప్రజలకి కొంత అపనమ్మక మేర్పడ్డా, సికింద్రాబాద్ కుట్రకేసుల్లాంటి కేసుల్ని ఎదుర్కొంటూ, ప్రభుత్వంపై ఖచ్చితంగా తిరుగుబాటు ధోరణి అవలంబించిన కొందరు సోదరులు ప్రజల్లో విరసం కీర్తిని పెంపుజేసి విరసంపై నమ్మకం కల్గించారు.

4) ఎమర్జన్సీ తరువాత విరసంకు రాజకీయాలు లేకుండాపోయాయన్న అసంతృప్తి నాకు లేదు— విరసాన్ని అర్థంచేసుకుంటె అన్నీ రాజకీయాలె.

5) విరసంవల్ల కొంత చైతన్యం పొందిన వారిలో నేనొకణ్ణి. అంటే ప్రజా సాహిత్యానికి సంస్కృతికి దోహదం చేసినట్లేగా— ఐనా విరసం అందర్నీ ఆకర్షించ లేదు. ఎందుకో? (నాకూ అర్థంకాలేదు.)

6) నా ఉద్దేశ్యంలో విరసం అందర్నీ (పెత్తందార్లను తప్ప) ఆకర్షించాలి, ఆకర్షింపబడాలి. అందుకు రచనల ద్వారానే కాకుండా, సాంఘిక సేవద్వారా ప్రజల్లో చొచ్చుకుపోవాలి.

# 'ముక్తిచాయ్' డాక్యుమెంటరీపై ఆంక్షలు

దేశమంతా రాజకీయ ఖయిదీల విడుదల గురించి చాల పెద్దమాటలు చెప్తున్నది మార్క్సిస్టు పార్టీ. మార్క్సిస్టు పార్టీ అధికారంలో వున్న పశ్చిమ బెంగాల్లో రాజకీయ ఖయిదీలనందరినీ విడుదల చేసారన్న ప్రచారం కూడ నిజం కాదన్నవాణ్ణి నమ్మలేనంతగా జరుగుతున్నది. కాని పశ్చిమ బెంగాల్ జెయిల్లో ఇంకా నక్సలైట్ ఖయిదీలు ఉన్నారని, అందులో స్త్రీలు, ఉరిశిక్షలు కూడ పడివున్న మోలీన భక్ లాంటివాళ్ళు ఉన్నారని వాస్తవాలు, వివరాలు తెలిసినవాళ్ళు తప్ప ఒప్పుకోలేరు. బెంగాల్ జెయిళ్ళలో స్త్రీ ఖయిదీల పట్ల జెయిలు అధికారులు ప్రవర్తిస్తున్న తీరు, అత్యాచారాలు కూడ ఇటీవలనే ఢిల్లీ పి యు సి ఎల్ ప్రజల దృష్టికి తెచ్చింది.

రాజకీయ ఖయిదీల విడుదల గురించి ఎవరైనా నిజాయితీతో సినిమా తీసినా సహించలేని బెంగాల్ వామపక్ష ప్రభుత్వం వైఖరికి సంబంధించిన వాస్తవాలు కొన్ని యిటీవలనే బయటికి వచ్చాయి.

1967 నుంచి 74 దాకా క్రియాశీల రాజకీయాల్లో పాల్గొన్న ముప్పై ఏళ్ళ యువకుడు ఉత్పలేందు చక్రవర్తి. రాజకీయ ఖయిదీలు వస్తువుగా తీసుకొని 'ముక్తిచాయ్' అని ఒక సినిమా తీసాడు. దానితో ఆయనకు సమస్యలు మొదలైనాయి. ఆయన తన సినిమా ద్వారా ఒక మౌలిక సత్యం చెప్పదల్చుకున్నాడు. ఆయన తన అనుభవాలు చెప్పదల్చుకున్నాడు. మన ప్రభుత్వాల నిర్మాణం (స్వభావం)లో భేదంలేదు. బ్రిటిష్ రాజ్ – కాంగ్రెస్ – జనతా ఇంకా ఇతర (దుష్) పరిపాలనలలో మారుతున్నది ప్రభుత్వాల పేర్లు మాత్రమే– ఇదే ఆయన అనుభవం. ఒక పాత కెమెరా అరువు తెచ్చుకొని కొన్ని నెలలపాటు షాట్స్ తీస్తూ వున్నాడు. అప్పుడు ఆయనకు రాజకీయ ఖయిదీల విడుదల గురించి సినిమా తీయాలన్న ఆలోచన తట్టింది.

ఉత్పలేందు కలకత్తాలో టీచర్. ఒక స్థానిక జానపద కళాకారుడు అయిన బీడీ కార్మికుని విషయంలో అతడు చూపిన ఆసక్తివల్ల ఉద్యోగం పోయింది. కాని అందువల్లనే అతనికి సంఘీభావం ప్రకటించిన విద్యార్థులు ఆయన సినిమాకోసం ఏడు వేల రూపాయిలు వసూలు చేసి యిచ్చారు. భార్యమీద వున్న బంగారమంతా అమ్మాడు. అప్పు చేసాడు– బిచ్చమెత్తాడు. మొత్తంమీద అవసరమైన ఇరువైమూడు వేల రూపాయలు సాధించాడు. ఇవిగాక సినిమా పని జరిగిన ఎనిమిది నెలల్లో ఎన్నో సాంకేతిక సమస్యలు ఎదుర్కొన్నాడు. కాని ఒకే ఒక్క సుగుణమేమంటే సెన్సార్ వాళ్ళు

---

7) విరసం విస్తృత ప్రజాస్వామ్య వేదిక కావాలంటే మాటలు కాదు కావలసినవి చేతలు, అందుకోసం అభిమానుల్ని, సమావేశపరచి పని పంచండి, ప్రచారం పెంపుచేసి (అభిమానులద్వారా) అభిమానుల్ని సంపాదించండి.

– రమాకాంత్
సికింద్రాబాద్

ఫిల్మ్‌లో కత్తెర పెట్టనేలేదు చట్టవ్యతిరేకంగా డిటెన్షన్‌లో పెట్టడమనే సంప్రదాయం మనకు 1919 నుంచి బ్రిటిష్ పాలన వారసత్వంగా వస్తున్నదన్నది ఇందులో వస్తువు, 'రాజకీయ ఖయిదీల విడుదల కాదు, ఇదుగో, ఈ చారిత్రిక (పాలకవర్గ) దృక్పథం మన సంప్రదాయంలో వుందే- ఇదే ముఖ్యం."

'ముక్తిచాయ్'ను పత్రికలు ముక్తకంఠంతో ప్రశంసించాయి.

'కొన్నిచోట్ల పాశవికంగా వుంది- కొన్నిచోట్ల హింసాత్మకంగా వుంది. కాని అన్నిచోట్లా నిజాయితీ వుంది.' 'ఫిల్మ్ సొసైటీలు యిచ్చే ప్రోత్సాహం కన్నా విస్తారమైన ప్రోత్సాహం లభించ వలసిన సినిమా.' 'తీవ్రమైన నిజాయితీతో ఈ చిత్రం ప్రకాశిస్తున్నది.'

ఫెడరేషన్ అఫ్ ఫిల్మ్ సొసైటీస్ అఫ్ ఇండియా ఈ సినిమాను ప్రదర్శనల కోసం తీసుకున్నది. కాని ఇవి ఉత్పలేందుకు ఇవన్నీ ఉత్సాహాన్నిచ్చే అంశాలే కాని డబ్బు తెచ్చే సాధనాలు కావుకదా.

డిసెంబర్ 77లో ఉత్పలేందుకు పశ్చిమ బెంగాల్ ప్రభుత్వం నుంచి వర్తమానం వచ్చింది. 'ఫిల్మ్ అడ్వైజరీ బోర్డు ఫలాని తేదీ రోజు ఈ ఫిల్మ్‌ను సమీక్షిస్తుంది' అని. ఆ బోర్డు డాక్యుమెంటరీలను ఎన్నిక చేసుకొని కొనుక్కుంటుంది. ఆరోజు ఆయన తన సినిమాతో హాజరయ్యాడు. ఆడిటోరియమ్‌లో ప్రదర్శన సమయంలో దర్శకుడు వుండకూడదు- కాని బయట వుండి టీ కాఫీలు పంపించాలి. ఆయన బయట వేచివున్నాడు. పశ్చిమ బెంగాల్ వామపక్ష ప్రభుత్వ సమాచార మంత్రి బుద్ధదేవ భట్టాచార్య సినిమా చూసి బయటికి వస్తూ ఉత్పలేందును చూసి పెచ్చని చిరునవ్వు నవ్వాడు. తనను తన ఆఫీసుకు వచ్చి కలుసుకొమ్మన్నాడు.

అక్కడ ఈ చిరునవ్వు అదృశ్యమయిపోయింది. ఔను, ఇది మంచి సినిమాయే- కాని సిపిఐఎమ్ మంత్రిగారు దీని రాజకీయ వస్తువుతో ఏకీభవించలేకపోయారు. చారుమజుందార్ బొమ్మలు చూపాల్సిన అవసర మేముంది- సిపిఐ ఎంఎల్ సిద్ధాంతకర్త, కవీ సరోజ్‌దత్తా మరణానికి కారణమేమిటి, ఎవరు అని ఎందుకు ప్రశ్నించాలి- ఇవీ ఆయన అభ్యంతరాలు. అందువల్ల ప్రభుత్వం ఈ సినిమాను కొనజాలదని, కాని ఉత్పలేందు ఇంకొక సినిమా తీయదల్చుకుంటే మాత్రం ఆర్థిక సాయం చేస్తుందని చెప్పాడు. ఉత్పలేందు ఈ సహాయం విషయం ఆలోచించేముందు తన ఫిల్మ్‌ను తిరస్కరిస్తూ, ప్రభుత్వం నుంచి లిఖితపూర్వకంగా లేఖ కావాలన్నాడు.

ఎన్నిసార్లు గుర్తుచేసినా వామపక్ష ప్రభుత్వం ఈ విషయంలో లిఖితపూర్వకంగా బయటపడడంలేదు. ఎందుకంటే సిపిఐఎం ట్రేడ్ యూనియన్లు, విద్యార్థి సంఘాలు ఈ సినిమాను 110 చోట్ల అప్పటికే ప్రదర్శించి వున్నాయి. రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగ

సంఘాల్లో సిపిఐఎంకు పట్టుకొమ్మలయిన ఎంప్లాయీస్ అండ్ వర్కర్స్ కోఆర్డినేషన్ కమిటీ కూడ ఇది తన సభ్యులందరికీ ఈ డాక్యుమెంటరీని చూపింది. ఎక్కడా ఎవరూ వ్యతిరేకత కానీ, నిరసన కానీ ప్రకటించలేదు.

కాని వాళ్ళ యూనియన్లకన్న ప్రభుత్వం చాల జాగ్రత్తగా వుండదల్చుకున్నది–'పవిత్రం'గా వుండదల్చుకున్నది. ఉత్పలేందు ఇలా 'బట్టబయలు' చేయడాన్ని వాళ్ళు ఎప్పటికీ ఖండిస్తూ వచ్చారు. ఇటీవలనే రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించిన యువజనోత్సవాల్లో 'ముక్తిచాయ్'ను ప్రదర్శించలేదు. త్వరలో కలకత్తాలో జరుగనున్న మూడవ ప్రపంచ చలన చిత్రోత్సవాల్లో తన డాక్యుమెంటరీని ప్రదర్శించ వలసిందిగా అడిగి లేదనిపించుకోవడం అనవసరమనుకున్నాడు ఉత్పలేందు.

పశ్చిమ జర్మనీ చలన చిత్రోత్సవాలకు ఈ డాక్యుమెంటరీ పంపించవలసిందిగా ఆహ్వానం రాగానే ఉత్పలేందు ఉత్సాహం మళ్ళా చిగురించింది. కాని కలకత్తాలోని సెన్సారుబోర్డు ప్రాంతీయ సంఘం "ఇది ఏ అంతర్జాతీయ చలనచిత్రోత్సవాల్లోనూ ప్రదర్శించడానికి అర్హమైంది కాదు" అని తేల్చివేసింది. ఎందుకిట్లా మొత్తంగా, ఎప్పుడూ పనికిరానిదిగా తాము నిర్ణయించారో కారణం చెప్పలేదు. ఈ సంఘం ఎందుకు ఈచిత్రానికి ఇట్లా ముద్రవేసిందో ఊహించడం కష్టమేమీ కాదు. ఇది ప్రభుత్వం నియమించిన సంఘం. ఇందులో వున్నవాళ్ళంతా కలకత్తాలో పెద్దపెద్ద స్థానాల్లోవున్న పెద్దలు. వాళ్ళకింత పెద్దరికం ఎట్లా వస్తుందో చెప్పలేం గానీ, ఆ పెద్దరికం దక్కించుకోడానికి మాత్రం వాళ్ళు తమ పిడికిళ్ళు (ముఖ్యంగా సినిమాలమీద) బిగిస్తూ వుంటారు. ఎమర్జెన్సీ 'రాజకీయ క్రమశిక్షణ' వాళ్ళ నరనరాన యింకిపోయింది. జనతాపార్టీకి మాత్రం అంతకన్న మంచివాళ్ళు ఎక్కడ దొరుకుతారు

ఇప్పటికీ ఎన్నో విదేశాలనుంచి ఈ డాక్యుమెంటరీకోసం ఆహ్వానాలు వచ్చాయి. కాని 'ముక్తిచాయ్'ను విదేశాలకు పంపించవద్దన్నది 'ఏకగ్రీవ' నిర్ణయం. ఇది చాల ఆశ్చర్యంగా వుంది. ఎందుకంటే ఈ సంఘంలోని ఒక సభ్యుడే ఈ ఫిల్ముమీద జరిగిన ఎన్నో సెమినార్లలో ఈ ఫిల్మును గొప్పగ పొగిడాడు. ఇంకొక సభ్యుడు ఇందులో అంతగా పనికిరాని అంశం ఏమిటంటె మౌనం వహించాడు. ఈ సంఘం మీద కూడ రాజకీయ ఒత్తిళ్ళు వున్నాయా? చెప్పడమెలా? వీటి ఏ సమావేశాల్లోను లిఖితపూర్వకమైన చర్చలు, నిర్ణయాలు లేవు. రాజకీయ ఖయిదీల విడుదల విషయంలో ఏ రాజకీయ పార్టీ చరిత్ర కూడ పవిత్రంగా లేదు. జెయిల్లో వున్న పార్టీ కార్యకర్తలమీద కత్తులు నూరడానికి అధికారంలోవున్న పార్టీకి ఏదో అక్కసు వుండకుండా ఎట్లా వుంటుంది. అందులోనూ 'ముక్తిచాయ్'లో చూపబడిన రాజకీయ ఖయిదీలు అధికారంలో వున్న పార్టీకి ఒకప్పుడు 'సహచరులు' (ఫెల్లోట్రావెలర్స్) కదా!

– సినీవాలి

**SRJANA Telugu Monthly July 78 H/WL-10**
Regd. No. with Registrar of News Papers 10953/67

(మొదటి కవరు తరువాయి)

కస్టడీలో వున్న ఒక్కగా నొక్క కొడుకు ఎక్కడున్నాడో కూడ ఆమెకు తెలియదు." తన ఒక్కగా నొక్క కొడుకును ఒక్కసారి చూసుకునే అవకాశమైనా రాజన్ తల్లికి కల్పించవలసిందని నేను చేసుకున్న విన్నపం కూడ బధిర శంఖారావ మయింది. సంజయ్ తల్లి రాజన్ తల్లి కన్నీళ్ళు తుడవడానికి ఇష్టపడలేదు.

ఇక్కడ ఇంకొక విషయం కూడ గమనించాలి. సంజయ్ తల్లిలాగా రాజన్ తల్లి చట్టబద్ధ విచారణను, చర్యలను తిరస్కరించలేదు. తన కొడుకు జెయిల్లో క్షేమంగా వుంటాడని శ్రీమతి ఇందిరా గాంధీకి తెలుసు. తన కొడుకు క్షేమం గురించి ఆమె వ్యక్తంచేస్తున్న భయాలన్నీ రాజకీయ స్టంటు తప్ప మరేమీకాదు. తన కొడుకు ఎక్కడున్నదో, ఏ స్థితిలో వుంచబడ్డాడో ఆమెకు తెలుసు. కాని మా కొడుకును పోలీసు కస్టడీలోకి తీసుకున్నపుడు ఈ మౌలికమైన మర్యాద కూడ మాపట్ల చూపలేదు. నా కొడుకుగానీ, నా కుటుంబ సభ్యులెవరు గానీ మన దేశ ప్రయోజనాలకు భంగకరమైన పని ఏదీ ఎన్నడూ చేయలేదు. కాని ఉరిశిక్షలు పడిన ఖయిదీలకు కల్పించిన సౌకర్యాలు కూడ మాకు కల్పించలేదు.

లక్షలాది భారతీయులకు ఈ హక్కులన్నీ నిరాకరించిన ఈ స్త్రీయే జనతాపార్టీ పుణ్యాన, ఇపుడు న్యాయ సంబంధమైన సౌకర్యాలన్నీ పుష్కలంగా అనుభవిస్తున్నది. ఒక అండర్ ట్రియల్ ఖయిదీకి సాధారణంగా ఇచ్చే సౌకర్యాలు సంజయ్‌కు ఇవ్వడంలేదని ఇప్పుడామె ఫిర్యాదు చేస్తున్నది. ఇది నిజమే అయితే మాత్రం అన్యాయమే. కాని తన చీకటిపాలనలో లక్షలాది మంది భారతీయులను భయంకరమైన పరిస్థితుల్లోపెట్టి వాళ్ళకేహక్కుల్ని లేకుండా చేసిన ఆమెకు ఈ హక్కులు అడిగే హక్కు ఎక్కడిదో నేను తెలుసుకో దల్చుకున్నాను. ఇవ్వాటికి కూడ ఆమె (తన చర్యలకు) పశ్చాత్తాప పడిన, సిగ్గుపడిన సూచనలు లేవు. ఆమె హరిజనుల సమస్యల గురించి నాయకత్వం వహిస్తున్నదన్నా, పీడితుల, నిమ్నజాతుల సమస్యలను పట్టించుకుంటున్నదన్నా, తన చుట్టూ తనను పొగిడేవాళ్ళ పార్టీని పోగేసుకుంటుందన్నా- ఇదంతా తన స్థానాన్నీ, తన వారసుల స్థానాన్నీ భద్రంగా క్షేమంగా నిలుపుకోవడానికేనని విశ్వసించక తప్పదు.

ఏది ఏమైనప్పటికీ ఏ స్త్రీయైనా, చివరకు శ్రీమతి ఇందిరా గాంధీయైనా, ఆమె కొడుకు ఎంత నేరం చేసినప్పటికీ, రాజన్ తల్లి వంటి దురదృష్టాన్ని పొందకూడదని నేను చిత్త శుద్ధిగా ఆకాంక్షిస్తున్నాను. ❞